

దత్తబంధు శ్రీ కోనేరు సత్యనారాయణ
వారి ధర్మపత్ని శ్రీమతి కోనేరు శివకాంచనలత గార్ల సహకారముతో



చిలుకూరు బాలకృష్ణమూర్తి, శ్రీమతి భవాని
శ్రీ దత్తసేవలో

గురు దక్షిణ రు. 15-00

దత్తావతారులు

# శ్రీ నృసింహ సరస్వతి మహరాజ్

**విషయసూచిక :**



## వి న్న ప ము

భక్త మహాశయులారా!

శ్రీ దత్తభగవానులు ప్రత్యక్షంగా వచించిన "శ్రీ దత్త గురు భగవద్గీత" సిద్ధముగా యున్నది. వలయువారు రు. 101/- చెల్లించి గ్రంథము పొందవచ్చును లేక రు. 116/- లు గురుదక్షిణ యం.ఓ. డి.డి. ద్వారా పంపి ఈ పవిత్ర గ్రంథమును పోస్టుద్వారా పొందవచ్చును. గ్రంథము రిజిష్టర్డు పోస్టులో పంపబడును.

శ్రీ టి. దేవోత్తం
1-8-37/C.
చిక్కడపల్లి
హైదరాబాద్-20
ఫోన్ 7645983

చిలుకూరు బాలకృష్ణ
41-15-4 నల్లగేటుడౌన్
కృష్ణలంక, విజయవాడ-13
ఫోన్ 521 809
MIG II Block 20 Flat 14
బాగ్ లింగంపల్లి, హైదరాబాద్-44
ఫోన్ 766 7758

# భగవాన్ శ్రీ దత్తాత్రేయ స్వామివారు



శ్లో॥ సదత్తాదపరోదేవః నప్రేష్ఠ: పరసాధనమ్:

తా॥ శ్రీదత్తునికన్నా వేరు దైవములేడు. దైవప్రేమకన్నా వేరుసాధనములేదు.

శ్లో॥ మాలా కంమడలురధ: కరపద్మయుగ్మే
మధ్యస్థ పాణియుగళే డమరుత్రిశూలే
యస్యస్త ఊర్ధ్వ కరయోశ్శుభశంఖ చక్రే
ధ్యాయేత్త మత్రివరదం భుజషట్కయుక్తం॥

శ్లో॥ ఆదౌబ్రహ్మ హరిర్మధ్యే అంతే దేవ సదాశివ:
మూర్తిత్రయ స్వరూపాయ దత్తాత్రేయ నమోస్తుతే.

శ్లో॥ గురుర్బ్రహ్మ గురుర్విష్ణు: గురుర్దేవో మహేశ్వర:
గురు సాక్షాత్పరబ్రహ్మ తస్మైశ్రీ గురవే నమః

దత్తావతారులు

# శ్రీ నృసింహ సరస్వతి స్వామివారు

గాణుగాపూరు

శ్రీ నరసింహ సరస్వతీ యోగి రాజం భజేహమ్
కర్ణాంత కమలనయనం కనక వర్ణచ్ఛాయం

వటవృక్షాధః శిలా తలో పరిపద్మాసనా సీనమ్
శ్రీ నరసింహ సరస్వతీ యోగి రాజం భజేహమ్.

నిజతనుధృత కాషాయాంబర సంవృతోత్తమాంగం
కంఠమాలా యుత పావన రుద్రాక్ష హారమ్॥

శ్రీ నరసింహ సరస్వతీ యోగి రాజం భజేహమ్॥
అనేకలీలా మహిమ ప్రదర్శన సద్గురుమూర్తిం

హరి హర బ్రహ్మాత్మక శ్రీ దత్తాత్రేయ పూర్ణావతారమ్
శ్రీ నరసింహ సరస్వతీ యోగి రాజం భజేహమ్.

మా గురుదేవులు

## శ్రీ సదానంద సరస్వతి మహరాజ్



శ్లో॥ గురు మధ్యే స్థితం విశ్వం విశ్వమధ్యే స్థితోగురు:
గురుర్విశ్వం నచాన్యోస్తి తస్మై శ్రీ గురవేనమ:

తా॥ ఎవనియందు ఈ విశ్వమంతా వున్నదో, ఎవరు విశ్వమంతా నిండి యున్నాడో, ఎవరు తప్ప ఈ విశ్వమంతటా వేరేమీ లేదో ఆ గురువుకు నమస్కారము.

మేము తెనాలిలో యుండగా అక్కడ జరిగిన సాధు సమ్మేళనమునకు విచ్చేసి పురజనుల కోరికను మన్నించి కొన్నాళ్ళు తమ సత్సంగ భాగ్యమును అనుగ్రహించి ఆ సందర్భముతో మమ్ము దగ్గరకు తీసి మంత్రోపదేశముచేసి మమ్ము ధన్యుల చేసిన మా గురుదేవుల పాద పద్మములకు హృదయపూర్వక నమస్సులు.

శ్రీ గురుదత్త    జయ గురుదత్త



దత్తావతారులు

# శ్రీ నృసింహ సరస్వతి మహరాజ్

# తొలిపలుకు

భక్త మహాశయులారా !

శ్రీ దత్త భగవానుని సేవలో శ్రీ దత్త చరిత్రతో దత్తావతారులు శ్రీపాద శ్రీవల్లభులు, శ్రీ అక్కలకోట మహరాజులు, శ్రీమాణిక ప్రభువు శ్రీ సాయినాధుడు చరిత్రలు అందించ గలిగాము. అంతా స్వామి అనుగ్రహము గురు కటాక్షము.

ఎన్నో జన్మల పుణ్య పరిపాకము లేనిదే శ్రీ భగవానుని సేవలోకి రాలేమని భగవానుని దివ్యవాణి ఎందరో మహానుభావులు వారందరికి వందనములు. మా గురుదేవులు శ్రీ సదానంద సరస్వతి మహరాజుల అనుగ్రహం వల్ల మాంసపిండము మంత్ర పిండమైనది. ధన్యులము. శ్రీశైల భ్రమరాంబ మల్లికార్జునుల సేవ, మా కులదేవత కనకదుర్గమ్మ తల్లి అర్చనము, కలియుగ ప్రత్యక్షదైవము శ్రీ వేంకటరమణుని ఆమంత్రనోత్సవ సేవాభాగ్యము, త్రిమూర్త్యాత్మకుడైన శ్రీ అన్నవరం వీర వేంకట సత్యనారాయణ స్వామివారి వ్రతసేవ, భద్రాద్రి సీతారాముల కళ్యాణ వైభోగము, కాశీ విశ్వేశ్వరుని దర్శన భాగ్యము, రామేశ్వర తీర్ధయాత్ర, కన్యాకుమారి నుండి బదరీ నారాయణుని వరకు అనేక తీర్ధయాత్రా ఫలములు భగవానుడు మా దంపతులకు అనుగ్రహించి కృతార్థుల చేశారు. ధన్యులం.

1961వ సంవత్సరంలో మేము చీరాలలో యుండగా పరమేశ్వరానుగ్రహంవల్ల, వాడరేవులో వేంచేసియున్న శ్రీసుబ్రహ్మణ్యస్వామి అవతారులు

శ్రీ లలితానంత సరస్వతి స్వామివారి అనుగ్రహాన్ని పొంది ధన్యులమయ్యాము.

ఇట్లుండగా 1968వ సంవత్సరంలో మేము తెనాలిలో యుండగా మా పురాకృత పుణ్యఫలంగా శ్రీ సదానంద సరస్వతి స్వామివారి కృపా కటాక్షానికి పాత్రులమైయ్యాము. మా గురుదేవులు శ్రీ సదానంద సరస్వతి స్వామివారు మాకూ ఆధ్యాత్మిక పురోగతిని అనుగ్రహించి ధన్యులు చేశారు.

ఇలా యుండగా 1992 సం॥ మహాశివరాత్రి పర్వదినాన దత్త భక్తులు శ్రీ జన్నాభట్ల వేణుగోపాల కృష్ణమూర్తిగారు శ్రీ దత్త పరబ్రహ్మ ఆదేశానుసారము హైదరాబాదులో మా స్వగృహానికి అకస్మాత్తుగా రావటము, శ్రీ దత్త భగవానుని గూర్చి మాకు ప్రవచించటము మా ఆతిధ్యము స్వీకరించటం జరిగింది. వారి అనుగ్రహంవల్ల హరిహరాత్మకులైన శ్రీ అయ్యప్పస్వామి వారి కృపతో శబరిమల యాత్రాభాగ్యం కల్గింది. మమ్ములను అనుగ్రహించటానికి కాబోలు మాతో వారు శ్రీశైలం విచ్చేసి అనేక సాధనలు చేయించి శ్రీ దత్త భగవానుడు వారికి సాక్షాత్తు వివరించిన అనేక దివ్య సందేశాలు మాకు వినిపించారు. 1993, 1994 సంవత్సరాలలో మమ్మి ఒకవిధంగా వెంటబడి బోధించిన దివ్య సందేశాలే 1995 సంవత్సరంలో గురుపూర్ణిమ కానుకగా శ్రీ దత్త భగవానుని ఆదేశానుసారం "శ్రీ దత్త వేదము" రూపంలో వెలువడింది.

పరబ్రహ్మము ఒకటేనని యు, రెండవది లేదమనియు, ఆ ఒక పరబ్రహ్మమే సృష్టి, స్థితి, లయములను మూడు కర్మలు చేయుచున్నాడను శ్రుతి వాక్యమును మాకు నూరిపోసి మమ్ముద్ధరించిన గురుదేవులు శ్రీ వేణుగోపాల కృష్ణమూర్తిగారికి వందన మాచరించి, దత్తావతారులు శ్రీ నృసింహ సరస్వతి స్వామివారి చరిత్ర క్లుప్తముగా నాచే స్వామి పలికించినట్లు పలుకుచున్నాను. ఆకర్ణింపుడు.

శ్రీ దత్త భగవానులు ఇట్లు వచించుచున్నారు. "నాయనా! విను, నిన్నటి గురించి చింతించి ఈ రోజును వృధా చేయకుము. రేపు అనునది లేదు అనుకొనుము. ఈ రోజే ఉన్నది కాన కాలాన్ని శక్తినీ పూర్తిగా

నాకే సమర్పించుము. నిన్ను రక్షించువాడను నేనే తప్ప ఈ సృష్టిలో ఏ వస్తువూ ఏ వ్యక్తి కాదు అనునది గుర్తుంచుకో" అని.

శ్రుతి వాక్యానుసారం పరబ్రహ్మము ఇట్లు నిర్వచించబడినది.

"ఏకమేవ అద్వితీయం బ్రహ్మ"
"యతోవా ఇమాని భూతాని
జాయన్తే యేన జాతాని జీవన్తి
యత్ప్రయన్త్యభిసం విశన్తి"

అనగా బ్రహ్మమొక్కటే. రెండవది లేదు. దేనినుండి ఈ పంచభూతములు పుట్టి దేనిచే నిలచి, దేనియందు లయించుచున్నవో అదే బ్రహ్మము.

శ్రీ దత్తభక్తులు శ్రీ దత్త ప్రభువుయొక్క సాక్షాత్కారము పొందిన మహాత్ములు వారికి స్వామి దర్శనమిచ్చినప్పుడు వచించిన వాణి ఇట్లున్నది.

"నేను నీకు ప్రత్యక్షముగా— త్రిముఖ షడ్భుజ రూపంలో కనబడు చున్నాను గదా!

"యత్సాక్షా దపరోక్షా ద్బ్రహ్మ"— అనగా ప్రత్యక్షమగుట కూడా శ్రుతివే చెప్పబడియున్నది కదా. కనుక ఈ కనపడుచున్న త్రిముఖ, షడ్భుజ రూపమే పరబ్రహ్మము నేనే పరబ్రహ్మము. ఇదే అసలు రూపము. మిగిలిన రూపాలు బ్రహ్మముయొక్క వేషాలేకాని అసలు రూపాలు కావు" అని శ్రీవారి దివ్యవాణి.

శ్రీ దత్త భగవానుని చిత్ర పటమును తిలకించుము. స్వామి త్రిముఖ, షడ్భుజములు కలిగియున్నారు. మొదటి ముఖమునకు హిరణ్య గర్భుడనియు, మధ్య ముఖమునకు నారాయణుడనియు, మూడవ ముఖము నకు సదా శివుడనియు పేర్లు. ఆరు హస్తములలో- పై రెండు హస్తముల యందు శంఖచక్రములు- మధ్య రెండు హస్తములయందు ఢమరుకము, త్రిశూలము-క్రింది రెండు హస్తములయందు అక్షమాల, కమండలము ధరించియున్నారు. మెడలో స్ఫటికమాల తులసి పూసలమాల రుద్రాక్షమాల, వనమాల ధరించియున్నారు. పీతాంబరధారి. కాషాయమేఖల పాదుకలు ధరించినారు. పాదముల నాశ్రయించి నాలుగు శునకములున్నవి గదా. అవియే నాలుగు వేదములు- సనక, సనందన, సనాతన, సనత్కుమార

బ్రహ్మ ఋషులే శునక రూపములతో పరిపూర్ణ విశ్వాసముతో శ్రీ స్వామి వారిని సేవిస్తున్నారు. శ్రీవారి వెనుకనే తెల్లని ఆవు కనపడుచున్నది గదా. యమధర్మరాజే ధర్మధేనువు రూపమున శ్రీవారిని సేవించుచున్నారు. శ్రీ దత్త ప్రభువులు వాణీ హిరణగర్భ, లక్ష్మీ నారాయణ, ఉమా మహేశ్వర-త్రిమూర్త్యాత్మకులు-బ్రహ్మముఖ నాలుకయందు వాణియు, విష్ణుముఖ వక్షస్థలమందు లక్ష్మియు, శివముఖ వామ భాగమున గౌరియు విలసిల్లియున్నారు. శ్రీవారు సర్వ బ్రహ్మర్షి, సర్వ సిద్ధాత్మకుడు. సర్వదేవతా-దేవాత్మకుడు. సర్వ గ్రహాత్మకుడు. అనగా నవగ్రహములు శ్రీ ప్రభువే-హృదయమున సూర్యభగవానుడు-రవి-ఆదిత్యుడు-ఓంకారము-

ఎడమ చేతిలో శంఖము - చంద్రుడు ఐం బీజము

కుడి చేతిలో చక్రము - కుజుడు — క్రోం బీజః

మధ్య హస్తములలో కుడి హస్తమున ఢమరుకము-బుధుడు—క్లీం బీజము

క్రింది ఎడమ హస్తమున - కమండలము - గురువు — క్లాం బీజము

- అక్షమాల శుక్రుడు — హ్రాం బీజము

మధ్య ఎడమ హస్తమున - త్రిశూలము - శని — హ్రీం బీజము

వామ పాదము - కేతువు — హ్రూం బీజము

దక్షిణ పాదము - రాహువు — సౌః బీజము

ఈ గ్రహములన్నియు జీవుల కర్మఫలముల నొసంగుచు కర్మఫల ప్రదాతయగు శ్రీ దత్త ప్రభువుల స్వరూపములే. వాణి, లక్ష్మి, గౌరి- ఈ ముగ్గురు శక్తులు కలసిన దుర్గ శ్రీ స్వామియే. స్వామికన్న వేరుకాని ఆ శక్తియే శ్రీ శక్తి. గణపతి, కుమారస్వామి, వీర భద్రాది శైవ రూపాలన్ని శ్రీ దత్త ప్రభువుల శివ ముఖంలోను- రామ, కృష్ణ, నరసింహాది రూపాలన్ని విష్ణు ముఖంలోను లీనమైయున్నాయి. హరిహరాత్మకుడైన మణి

కంఠుడు శ్రీవారి హరిహర ముఖాలే. త్రిమూర్తుల అంశ అయిన శ్రీ దత్త ప్రభువులలోనే కనిపించును. శ్రీ దత్త అంశావతారాలైన సిద్ధులందరూ అన్ని దేవతా రూపాలను చూపించగలుగుచున్నారు.

శ్రీ దత్త భగవానుడు కలియుగంలో ఇప్పటివరకు ఆరు అవతారములు దాల్చారు లోకోద్ధరణకోసం. 1. శ్రీపాద శ్రీ వల్లభువులు. 2. శ్రీ నృసింహసరస్వతి స్వామి 3. శ్రీమాణిక ప్రభువులు 4. శ్రీఅక్కలకోట మహారాజులు 5. శ్రీ శిరిడి సాయినాధుడు. 6. వర్తమాన దత్తావతారులు శ్రీ సత్యసాయినాధుడు.

శ్రీ దత్త భగవానులు ప్రత్యక్షంగా వచించిన శ్రీ దత్తగురుభగవద్గీత శ్రీ దత్త భక్తులచే లిఖింపబడినది. శ్రీదత్త భగవానుని ఆజ్ఞానుసారముచే భక్తకోటికి అందించు భాగ్యము మా దంపతులకు శ్రీ వారు అనుగ్రహించారు ధన్యులము.

శ్రీ నృసింహ సరస్వతి స్వామివారి చరిత్ర క్లుప్తంగా శ్రీ దత్త ప్రభుల ఆజ్ఞమేరకు గురు కటాక్షం చేత స్వామి నాచే పలికించిన మేరకు పలికి తరించెదనుగాక. ఇందులో ఏవైనా తప్పులున్న మావి కీర్తిస్వామి వారిది అని మనవి.

శ్రీ దత్తభగవానుని సేవలో

చిలుకూరు బాలకృష్ణమూర్తి
ధర్మపత్ని భవాని
విజయవాడ.

బహుధాన్యనామ
సంవత్సరమాఘ
బహుళ గురుప్రతిపద
పాడ్యమి 1-2-99

శ్రీ దత్త

# ఓ బహుధాన్యనామ సంవత్సరమా ధన్యరాలవు!

శ్రీదత్త పరబ్రహ్మ అనుగ్రహాన్ని పొందిన ధన్యత దక్కించుకుంటివి గదా! ఆహా! బహుధాన్య నామసంవత్సరం - ఉత్తరాయణ పుణ్యకాలం- మాఘమాసం. కృష్ణపక్షము ·పాడ్యమి- శుక్రవారం- ఆనాడు శ్రీ నృసింహ సరస్వతిస్వామి పుష్పాసనంమీద కూర్చుని శ్రీశైలమహాక్షేత్రంలో పాతాళగంగలో కృష్ణానదీ ప్రవాహంలో కదళీవనానికి పయనించారు. అదే గురుప్రతిపదగా ప్రకటితమైనరోజు. శ్రీదత్తావతారులు శ్రీ నృసింహసరస్వతిస్వామి వారి అనుగ్రహంవల్ల ఇప్పుడు మళ్ళీ బహుధాన్య నామ సంవత్సరం రావటం—ఉత్తరాయణ పుణ్యకాలం ప్రవేశించటం—మాఘమాసంలో కృష్ణపక్షంలో పాడ్యమినాడు ఈ పవిత్రగ్రంథం వెలువడటం ఆ ం శ్రీ గురుడు మా దంపతులకు ప్రసాదించటం మా పూర్వజన్మ సుకృతమే కాదు సాక్షాత్తు గురుకృప. ధన్యులం!

స్వామీ ఎన్ని జన్మ లెత్తినా సరే, నీ పాదారవిందముల యందు అచంచలమైన, దృఢమైన విశ్వాసం, భక్తిని ప్రసాదించి స్వామి సేవా పరాయణులమగునట్లు అనుగ్రహించవయ్యా! అని ప్రణమిల్లుదము.

మరల బహుధాన్యనామ సంవత్సరమే. చైత్రశుద్ధ త్రయోదశి దత్తావతారులు శ్రీ అక్కలకోట మహారాజులవారు మర్రిచెట్టులో లీనమైనారు. ఆహా! బహుధాన్యనామ సంవత్సర వైభవం గాదా!

మరల బహుధాన్యనామ సంవత్సరమే మార్గశిర పూర్ణిమ గురువారము. శ్రీదత్త జయంతి- ది 3-12-1998

శ్రీదత్త భగవానులు సాక్షాత్తు వచించిన శ్రీదత్త గురుభగవద్గీతను మా గురుదేవులు, శ్రీదత్త భక్తులు శ్రీ జన్నాభట్ల వేణుగోపాలకృష్ణమూర్తి గారు మమ్మనుగ్రహించి మా ద్వారా అందించి మమ్ము ధన్యులంచేయటం.

ఎంతటి భాగ్యం అద్భుతం కదా!

ఆహా! స్వామీ!! ఎంతటి దయాళువువయ్యా! మా ఇంట, వెంట, జంటనుంటవే! మమ్మనుగ్రహించవయ్యా! అని మరల మరల ప్రణమిల్లి ధన్యులమగుదుము గాక!

ఓం శాంతి! శాంతి! శాంతి!

చిలుకూరు కృష్ణమూర్తి శ్రీమతి భవాని.



## శ్రీ దత్త దివ్యవాణి
### ది. 19-1-99 బహు ధాన్యనామ సం॥ మాఘ శుద్ధ—విదియ

శ్లో॥మనుష్యాణాం సహస్రేషు
కశ్చిద్యతతి సిద్ధయే
యతతామపిసిద్ధానాం
కశ్చిన్మాంవేత్తితత్త్వతః
—భగవద్గీత

అనేక మనుష్యులలో ఒకఁ సిద్ధిని ొందును. ఆ సిద్ధిని పొందిన సిద్ధులలోను ఒకానొకడే నన్ను గురించిన సత్యమును తెలియును.

ఒకడు కలలో క్రిందమెట్టు నుండి పైమెట్టుకు ఎక్కుచున్నాడు. ఇతడు సిద్ధుడే. ఎందువలన ? సాధించినవాడు కాన సిద్ధుడే. అయితే అదంతయును అసత్యమే. కలనుండి మేల్కొన్నవాడు ఇదంతయును కల అనగా అసత్యమని తెలుసుకొని సత్యమును గుర్తించుచున్నాడు. ఇతడు జ్ఞాని. కావున సిద్ధులలోను ఒకానొకడు మాత్రమే సత్యమును తెలిసిన జ్ఞాని. సిద్ధుడైనంత మాత్రాన జ్ఞాని కావలసిన పనిలేదు. సిద్ధపురుషులైనంత మాత్రమున సత్యమును తెలిసిన జ్ఞాని కాబని లేదు.

అనేక దేవతల నుపాసించు వారలు ఆయా దేవతల అనుగ్రహమును పొంది సిద్ధిని పొందవచ్చును. కాని యీ దేవతలందరు వేషములనియును, వేషధారియగు వ్యక్తి శ్రీ దత్త భగవానుడే అనియు తెలియువాడే జ్ఞాని.

మనుష్యులలో ఒకానొకడు సిద్ధుడగును. ఆ సిద్ధులలో ఒకానొకడే జ్ఞాని యగును. జ్ఞాని యనగా జ్ఞానము కలవాడు. జ్ఞానము అనగా వేదము అని అర్థము. వేదము ద్వారా సృష్టి, స్థితి, లయములను చేయు ఏకైక వ్యక్తియే పరబ్రహ్మమని తెలిసి, త్రిముఖముల ద్వారా సృష్టి, స్థితి లయము లను చేయు ఏకైక వ్యక్తి శ్రీ దత్త భగవానుడే అని గుర్తించు జ్ఞానము

ఏ ఒక్క సిద్ధునికే కలుగును. వీరవైష్ణవ, వీర శైవ, వీర శాక్తేయులలో సిద్ధులైన మహాత్ములలో ఏ ఒక్క సిద్ధుడో యీ సత్యజ్ఞానము పొంది జ్ఞాని యగును.

జన్నాభట్ల వేణుగోపాల కృష్ణమూర్తి
దత్త భక్తులు

శ్రీ గురుదత్త                                                                 జయగురుదత్త

## దత్తావతారులు శ్రీ నరసింహ సరస్వతి మహరాజ్

# శ్రీ దత్తాత్రేయ షోడశావతారాలు

భగవాన్ శ్రీ దత్తాత్రేయస్వామి వారు సాక్షాత్తు పరబ్రహ్మ స్వరూపము. వారి నుండి త్రిమూర్తులు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు. వారి నుండి మూడుకోట్ల దేవతలు, వారి నుండి 33 కోట్ల దేవతలు వచ్చారు. పరబ్రహ్మమైన శ్రీ దత్త ప్రభువులు కలియుగానికి పూర్వము 16 సాక్షాత్కారాలు అనుగ్రహించారు. అవియే 16 అవతారులుగా కీర్తి నొందాయి.

## శ్రీ దత్తాత్రేయ షోడశావతారాలు

1) యోగిరాజు

అద్వయానంద రూపాయ! యోగమాయాధరాయచ
యోగి రాజాయ దేవాయ । శ్రీ దత్తాయనమోనమః॥

2) అత్రివరదుడు.

మాలా కమండలధరః కరపద్మయుగ్మే
మధ్యస్థ పాణియుగళేడమరూ త్రిశూలే
యస్యస్థ ఊర్ధ్వకరయోః శుభశంఖ చక్రే
ధ్యాయేత్త మత్రివరదం భుజషట్క యుక్తమ్॥

3) శ్రీ దత్తాత్రేయుడు

దత్తాత్రేయ శివం శాంత । మింద్రనీల నిభంప్రభుమ్
ఆత్మమాయారతం దేవ । మవధూతం దిగంబరమ్॥

4) కాలాగ్ని శమనుడు
జ్ఞానానుదైక దీప్తాయ । కాలాగ్ని శమనాయచ
భక్తారిష్ఠ వినాశాయ । నమోస్తు పరమాత్మనే॥
యోగిజనావల్లభుడు
5) యోగ విజ్ఞాననాథాయ । భక్తానందకరాయచ
దత్తాత్రేయాయదేవాయ । తేజో రూపాయ తేనమః॥
6) శ్రీ లీలా విశ్వంబరుడు
పూర్ణబ్రహ్మ స్వరూపాయ। లీలా విశ్వంభరాయచ
దత్తాత్రేయాయదేవాయ। నమోస్తు సర్వసాక్షిణే॥
7) సిద్ధరాజు
సర్వ సిద్ధాంత సిద్ధాయ। దేవాయ పరమాత్మనే
సిద్ధరాజాయ సిద్ధాయ। మంత్ర ధాత్రే నమోనమః॥
8) జ్ఞానసాగరుడు
సర్వత్రాఽజ్ఞాన నాశాయ। జ్ఞాన దీపాయ చిత్మనే
సచ్చిదానంద బోధాయ। శ్రీ దత్తాయ నమోనమః॥

9) విశ్వంభరావధూత
విశ్వంభరాయ దేవాయ। భక్తప్రియకరాయచ
భక్తప్రియాయు దేవాయ। నామప్రియాయతే నమః॥

10) మాయా యుక్తావధూత
మాయా యుక్తాయ శుద్ధాయ। మాయాగుణ హరాయః
శుద్ధబుద్ధాత్మ రూపాయ। నమోఽస్తు పరమాత్మనే॥

11) మాయా ముక్తావధూత
స్వమాయా గుణగుప్తాయ। ముక్తాయ పరమాత్మనే
సర్వత్రా 2జ్ఞాన నాశాయ। దేవదేవాయతే నమః॥

12) ఆదిగురువు
దత్తాత్రేయం మహాత్మానం। వరదం భక్త వత్సలం
ప్రపన్నార్తిహరం వందే। స్మర్తృగామీ సనోవతు॥

13) శివరూపుడు
సంసార దుఃఖ నాశాయ। శివాయ పరమాత్మనే
దత్తాత్రేయాయ దేవాయ। నమోఽస్తు పరమాత్మనే॥
14) శ్రీ దేవ దేవ
సర్వాపరాధ నాశాయ। సర్వపాప హరాయచ
దేవదేవాయ దేవాయ। నమోస్తు పరమాత్మనే॥
15) దిగంబరుడు
సర్వరోగ ప్రశమనం। సర్వపీడా నివారణం
ఆపదుద్ధరణం వందే। స్మర్తృగామీ సనోవతు
16) శ్రీకృష్ణ శ్యామ కమలనయనుడు
అఖండాద్వైత రూపాయ। నిర్గుణాయ గుణాత్మనే
కృష్ణాయ పద్మనేత్రాయ। నమోఽస్తు పరమాత్మనే॥

దత్తావతారులు

# శ్రీ నృసింహ సరస్వతి మహరాజు

## ప్రథమాధ్యాయము

శ్రీ దత్తభగవానుడు కలియుగంలో 6 అవతారాలు దాల్చారు.

1. శ్రీపాద వల్లభుడు 2. శ్రీ నరసింహ సరస్వతి 3. మాణిక ప్రభువు 4. అక్కలకోట మహారాజ్ 5. శిరిడి సాయినాధుడు 6. శ్రీ సత్యసాయినాధుడు.

శ్రీ దత్త భగవానుని మొదటి అవతారం పిఠాపురంలో శ్రీ పాద శ్రీ వల్లభులని తెలుసుకున్నాం గదా. కురుపురంలో జరిగిన సంఘటన ఇక్కడ సూక్ష్మంగా మనవి చేయాలి. కురుపురంలో ఒక బ్రాహ్మణ దంపతులకు ఒక పుత్రుడు జన్మించడం- వాడు బుద్ధిహీనుడు, జడుడు, మూర్ఖుడు అవటం- తండ్రి ఉపనయనంచేసి గాయత్రి మంత్రోపదేశం చేసినప్పటికి ఆ బాలుడు తెలివిహీనుడుగనే యుండటం- తండ్రి దిగులుతో స్వర్గస్థుడవటం- తల్లి పిల్లవాడు భిక్షాటనతో జీవితం సాగించటం- గ్రామస్థులు చదువురాని పశువా- కృష్ణానదిలోపడి చావరాదా అని ఆ

బాలుని పరిహసించటం- ఆ బాలుడు ఆత్మహత్యా ప్రయత్నం చేయటం- తల్లి దీనురాలై ఆ పిల్లవాని వెంట పడటం- శ్రీ పాద వల్లభులు ఆ బ్రాహ్మణ బాలుని ఆపి హస్త మస్తక సంయోగం చేయటం- ఆ బాలుని తల్లికి శివపూజలో శేష జీవితాన్ని గడపమని చెప్పి, వచ్చే జన్మలో తనతో సమానమైన సత్పుత్రుడు కలుగుతాడని ఆశీర్వదించటం జరిగింది. ఇప్పుడు ప్రస్తుత చరిత్రలోకి వద్దాము. స్వామివారి ఆజ్ఞానుసారం ఆ స్త్రీ తన శేష జీవితాన్ని శివపూజలో గడిపి మరణించింది. ఆ పుణ్యఫలంగా ఆమె కరంజా అనే పట్టణంలో ఒక మంచి బ్రాహ్మణ దంపతులకు పుత్రికగా జన్మించింది. ఆ దంపతులు ఆమెకు అంబ అని నామకరణం చేశారు. అంబ దినదినాభివృద్ధి చెంది కళాప్రపూర్ణయై యౌవనవతి అయింది. తల్లి దండ్రులు ఆమెకు వివాహం చేయాలని మంచి వరునికై అన్వేషణ సాగించారు. ఇట్లుండగా అదృష్టవశాత్తు మాధవశర్మ అనే యోగ్యుడైన వరుడు లభించడం, ఆ బ్రాహ్మణోత్తమునితో వైభవోత్తమంగా కళ్యాణం జరగటం తృటిలో పూర్తి అయినవి. అంబ తన పూర్వజన్మ సంస్కారం వల్ల భర్తను సాక్షాత్తు భగవంతునిగా భావించి మహా పతివ్రతా శిరోమణిగా కాలం గడుపుతున్నది. నిత్యం శివపూజ యథావిధిగా చేస్తూనే యున్నది. ఇట్లుండగా ఆమె గర్భవతి యైనది. మంచి శుభలగ్నంలో ఆమెకు పుత్రుడు జన్మించాడు. అద్భుతం! మహదాశ్చర్యం. ఆ పిల్లవాడు సామాన్య శిశువులవలే ఏడ్వలేదు. పుడుతూనే "ఓం" కారము చేశాడు. అందరు ఆశ్చర్యచకితులైనారు. మాధవశర్మ జ్యోతిష్కులను రావించి జాతక చక్రం వేయించాడు. వారు చాలా ప్రశంసించారు. "మాధవశర్మా! మీ దంపతులు చాల్హా అదృష్టవంతులు. ఈ బాలుడు చాలా గొప్పవాడవుతాడు. లోకంలో కీర్తివంతుడౌతాడు. గృహస్థాశ్రమంలో ఉండడు. సాక్షాత్తు భగవదంశ కలవాడే" అని వచించిరి. ఆ బాలునికి "నరహరి" అని నామకరణం చేశారు.

నరహరి బాల్యంనుండి యే లీలలు ప్రదర్శించాడు. ఒకనాడు ఒక విచిత్రం జరిగింది. తల్లికి, బాలునికి వలసినన్ని పాలు లేకపోయినవి. అప్పుడు ఆ బాలుడు తన చిన్నారి హస్తములతో ఆమె వక్షస్థలమును

సృజించాడు. అంతే! మాతృ వాత్సల్యము ఉబికిపోయింది. క్షీరము ధారగా కురిసింది. ఇది చూచిన తల్లి, తన బిడ్డకు దృష్టి కొడుతుందనే భయంతో చాలా రహస్యంగా ఉంచింది. ఇలా కాలం దొర్లుతున్నది. నరహరికి ఏడవ సంవత్సరం వచ్చింది. కాని సామాన్య బాలురకు వచ్చేమాటలు కూడా రాలేదు. తల్లి చాలా దుఃఖించింది. ఎన్నో పూజలు చేసింది. కాని మాటలు రాలేదు. తల్లి దుఃఖాన్ని చూచి నరహరి సైగచేసి ప్రక్కనే ఉన్న ఒక ఇనుప వస్తువును తాకాడు. అద్భుతం! ఆ ఇనుప వస్తువు బంగారంగా మారింది. అప్పుడు ఆ దంపతులు తమ బాలుడు సామాన్యుడు కాడని సాక్షాత్తు సిద్ధుడని తెలుసుకున్నారు. కాని ఎన్నాళ్ళు గడచిన పిల్లవానికి మాటలు రాలేదు. అప్పుడు తండ్రికూడా కన్నీరు పెట్టాడు. నరహరి తండ్రి కన్నీరు తుడుచి తనకు ఉపనయనము చేయమని సంజ్ఞ చేశాడు. భగవదాజ్ఞగా భావించి తండ్రి పిల్లవానికి ఉపనయనం చేశాడు. గాయత్రీ మంత్రోపదేశం అయినది. అప్పుడు ఒక అద్భుతం జరిగింది. వెంటనే నరహరి గాయత్రీ మంత్రాన్ని స్ఫుటంగా ఉచ్చరించి తల్లిదండ్రులకు వందనం చేశాడు. అందరు ఆనంద భరితులైనారు.

ప్రథమభిక్ష. తల్లికి నమస్కరించాడు. అప్పుడు ఆ మాతృమూర్తి ఇలా పలికింది. 'నాయనా నీవు ఇప్పటినుంచి భిక్షతోనే జీవించాలి' అన్నది చిరునవ్వు చిందిస్తూ.

వెంటనే నరహరి "భవతి భిక్షాందేహి" అని మాతృభిక్ష స్వీకరించాడు. తర్వాత సభకు నమస్కరించి వేదములను అవలీలగా వల్లించాడు. అందరు ఆశ్చర్యచకితులైనారు. తల్లిదండ్రుల ఆనందం ఎంతోసేపు నిలవలేదు. నరహరి తల్లి వద్దకు వచ్చి "అమ్మా! నీవన్నట్లే జీవితాంతము భిక్షువుగానే ఉంటాను. నేను సన్యాసినవుతాను. నాకు అనుజ్ఞ ఇవ్వు" అని ప్రార్థించాడు. తల్లిదండ్రులు విచార సాగరంలో మునిగిపోయారు. "నాయనా! నీ వొక్కడవే కదా మాకు. నీవు ఇట్లు మమ్ము వదలి వెళితే మా సంగతి ఏమిటి? నీవు గృహస్థుడవు కావాలని మా కోరిక" అని పలు విధముల దుఃఖించారు. అప్పుడు నరహరి తల్లికి దివ్యజ్ఞానాన్ని బోధించాడు. నీకు ఇంకా నల్గురు పుత్రులు కలుగుతారు. చింతించవద్దు" అని చెప్పి

తల్లికి తన నిజరూప దర్శనాన్ని అనుగ్రహించాడు. వెంటనే ఆమెకు పూర్వజన్మ వృత్తాంతము జ్ఞప్తికి వచ్చింది. తాను పూర్వజన్మలో మూర్ఖ బాలకుని తల్లిననియు, తనను తన బాలకుని ఆత్మహత్యనుండి కాపాడిన శ్రీపాదస్వామియే ఈనాటి నరహరి అని తెలుసుకున్నది. కొంతకాలము నరహరి తన తల్లిదండ్రుల కోర్కె ప్రకారం వారివద్ద యున్నాడు. వారికి సంతానం కలుగగానే వారిని వేడుకుని అనుమతి పొంది సన్యసించి అచట నుండి బయలుదేరాడు. శ్రీ కృష్ణ సరస్వతీ పాదుకల వారివద్ద సన్యాసం స్వీకరించాడు. అప్పటినుండి నరహరి శ్రీ నృసింహ సరస్వతిగా వ్యవహ రింపబడ్డారు. శ్రీ నృసింహ సరస్వతీస్వామి కాశీ క్షేత్రంలో కొంతకాల మున్నారు.

శ్రీ నరసింహ సరస్వతి స్వాములవారి గురు పరంపర— వారి శిష్యుల గురించి తెలుసుకుందాం.

ప్రథమంలో—గురువు పరమశివుడు. ఆయన శిష్యుడు విష్ణువు. వారి శిష్యుడు బ్రహ్మ-తర్వాత వసిష్ఠుడు-శక్తి-పరాశరుడు-వేదవ్యాసుడు-శుకుడు-గౌడపాదుడు-గోవిందపాదుడు-వారి శిష్యులు శంకర భగవత్పాదులు-విశ్వరూపుడు-బోధ జ్ఞాని, సింహగిరి-ఈశ్వరుడు-నృసింహుడు-శివతీర్థుడు-భాగీర తీర్థుడు-విద్యారణ్యుడు, మలయానందుడు, దేవతీర్థుడు, యాదవేంద్ర సరస్వతి-వారి శిష్యుడు కృష్ణానంద సరస్వతి. శ్రీ నృసింహ సరస్వతి స్వామి ఈ కృష్ణానంద సరస్వతి స్వామివారి శిష్యులు.

శ్రీ నృసింహ సరస్వతి స్వామివారి శిష్యులు-బాలుడు, కృష్ణుడు, ఉపేంద్రుడు, జ్ఞానజ్యోతి, సదానందుడు, మాధవుడు, సిద్ధుడు.

తల్లికి ఇచ్చిన మాటను నిజం చేయటానికి శ్రీ నృసింహ సరస్వతి స్వామి తిరిగి జన్మస్థానానికి వచ్చారు. తల్లితండ్రులను సోదరులను, చెల్లెలును పరామర్శించారు. తన పూర్వజన్మను కళ్ళకు కట్టినట్టు చూచిన ఆ తల్లి శ్రీ నృసింహ సరస్వతి స్వామివారితో ఇలా చెప్పుకున్నది. "నాయనా! మాకు భవబంధ విముక్తి ప్రసాదించు. నీ మాయను ఉపసంహ రించు"- అని విన్నవించుకున్నది. అందుకు స్వామి ఇలా అనుగ్రహిం చారు. "అమ్మా! ఏ కులంలో సన్యాసి ఉద్భవిస్తాడో ఆ కులం పవిత్ర

మౌతుంది. కనుక మీకుకాశీలో ముక్తి కల్గుతుంది" అని అనుగ్రహించారు. చెల్లెలు రత్నకు హితబోధ చేశాడు. స్త్రీకి భర్తే శరణ్యమని ఉద్బోధించారు.

అక్కడనుండి శ్రీ గురుడు శిష్యులను వెంటపెట్టుకొని గోదావరీ తీరానికి వెళ్ళారు. నాశిక్ త్రియంబకము పావనం చేశారు. శ్రీ గురుని మహిమలు, లీలలు అద్భుతాలు. మనం శ్రీవారి లీలలను ఆకరించి తరింతుము గాక!

## ద్వితీయాధ్యాయము
## శ్రీవారి లీలలు

శ్రీ గురుడు గోదావరి నదీతీరంలో యున్నప్పుడు ఒక విచిత్రం జరిగింది. ఒక బ్రాహ్మణుడు మెడకు బండ కట్టుకొని గోదావరిలో దూకి ఆత్మహత్య చేసుకొనుటకు ప్రయత్నిస్తున్నాడు. అక్కడ వున్న వాళ్ళంతా హాహాకారాలు చేస్తున్నారు. అప్పుడు శ్రీ గురుడు వానిని పిలచి, "పిచ్చి వాడా! ఎందుకు ఆత్మహత్యా ప్రయత్నం చేస్తున్నావు. ఆత్మహత్య మహా పాపం గదా అని హెచ్చరించారు. అందుకు ఆ పేద బ్రాహ్మణుడు "స్వామీ! ఏమని విన్నవిస్తాను. నేను ఉదరకోశ రోగంతో బాధపడు తున్నాను. అన్నం తినే అదృష్టాన్ని నేను నోచుకోలేదు. ఈ శూలవ్యాధిని భరించలేక ఇట్లు ఆత్మహత్య చేసుకుంటున్నానని "హృదయ విదారకంగా విలపించాడు. శ్రీ గురుడు కరుణించాడు. "బ్రాహ్మణా! ఆత్మహత్య మహా పాపం. నీ ఉదర వ్యాధిని నేను పోగొట్టుతాను. నీవు అన్నం తినేట్లు చేస్తాను. ధైర్యంగా ఉండు." అని చెప్పి, ప్రక్కనే వున్న సాయందేవుని పిలచి ఇలా సెలవిచ్చారు. "నాయనా! సాయందేవా! ఈ బ్రాహ్మణునకు మందిస్తాను. దానికి అనుపానంగా షడ్రసోపేతమైన భోజనం పెట్టు" అని ఆజ్ఞాపించారు. అప్పుడు సాయందేవుడు ఆశ్చర్యచకితులై "స్వామీ! పది రోజుల కొకసారి కొంచెం అన్నం తింటేనే ఇంతటి శూలవ్యాధితో బాధపడే వాడికి షడ్రసోపేత భోజనం పెడితే మృత్యుతుల్యం కాదా" అన్నాడు. శ్రీ గురుడు నవ్వి "నాయనా! నాకంటే గొప్ప వైద్యుడున్నాడయ్యా? ఏమి పరవాలేదు. భోజనం పెట్టు. అపైన నేను చూచుకుంటాను" అన్నారు. అంతే శ్రీ గురుని ఆశీస్సులు పొందిన ఆ బ్రాహ్మణుడు పరిపూర్ణ ఆరోగ్య

వంతుడైనాడు. ఎంత వింత! ఆనాటినుండి ఆ బ్రాహ్మణుడు జ్ఞానం కలిగి శ్రీ గురుని శిష్యకోటిలో ఒకడైనాడు.

మరియొక్క అద్భుతం. సాయందేవుడు శ్రీ గురుని చేరి వినమ్రుడై విన్నవించుకున్నాడు. "స్వామీ! నన్ను రక్షించండి. నేను విధిలేక ఒక యవనుడి వద్ద అధీనంలో ఉన్నాను. అతడు ప్రతి సంవత్సరము ఒక బ్రాహ్మణుణ్ణి బలి ఇస్తాడు. ఈ సంవత్సరం నా వంతు వచ్చినదట. రమ్మని కబురుచేశాడు. నన్ను మీరే రక్షించాలి" అని వలవల యెడుస్తూ శ్రీ గురుని పాదాలపై పడ్డాడు. అప్పుడు శ్రీ గురుడు సాయందేవుని ఆశీర్వదిస్తూ అభయప్రదానం చేశాడు. సాయందేవుడు లేచి శ్రీ గురుని సెలవు తీసుకొని ఆ యవనరాజు సన్నిధికి వెళ్ళాడు. ఆలస్యమైనందుకు ఆ యవనుడు మండిపడ్డాడు. ఇంట్లోకి వెళ్ళిపోయాడు. సాయందేవుడు భయభ్రాంతుడై నారు. శ్రీ గురుని మనస్ఫూర్తిగా ధ్యానం చేయటం మొదలుపెట్టాడు. విచిత్రం. క్రోధోద్దీపితుడైన యవనుడు లోపలకు వెళ్ళగనే వింతానుభూతిని పొందాడు. స్పృహ కోల్పోయాడు. కొంత వ్యవధి గడిచింది. నిద్రలో నుండి మేల్కొన్నట్లు మేల్కొన్నాడు. ఆ క్రోధం అంతా మటుమాయమై పోయింది. ఆ బ్రాహ్మణ శ్రేష్ఠుడైన సాయందేవుని సగౌరవంగా అభరణా లంకారుని చేసి సాగనంపాడు. సాయందేవుడు బ్రతుకుజీవుడా అన్నట్లు ప్రాణం దక్కించుకొని, గౌరవానికి ఉబ్బితబ్బిబ్బై, అంతయు శ్రీ గురుని మహిమయని తెలుసుకొని శేష జీవితాన్ని శ్రీ గురుసేవతో తరించాడు. ఎంతటి కరుణ.

శ్రీ గురుని మహిమలు ఎన్ని విన్నా ఇంకా వినాలనే ఉంటుంది. ఇది సహజం. భక్తులకు మరీ సహజం. శ్రీ గురుడు వైద్యనాథంలో కొన్నాళ్ళు ఉండి అక్కడనుండి భిళ్ళవటి చేరారు. అచ్చటయున్న నదీ తీరాన ఉన్న ఉదుంబర వృక్షమూలంలో ఉన్నారు. అక్కడ కరవీరమనే గ్రామముంది. ఆ గ్రామ నివాసియైన ఒక బ్రాహ్మణునకు ఒక బుద్ధిహీనుడు, మూర్ఖుడు అయిన బాలుడు జన్మించాడు. వాడిని అందరు "నీవు శుంఠవు. అపహాస్యం చేశారు. సిగ్గుపడి అరణ్యాలకు వెళ్ళి ఏకాం తంలో తీవ్రముగా దేవిని ఉపాసించాడు. తన నాలికను ఖండించి సమర్పిం

చాడు. అమ్మవారు అతనికి స్వప్నంలో దర్శనమిచ్చింది. "నాయనా! కృష్ణా నదీతీరంలో శ్రీ నృసింహ సరస్వతియను యోగీంద్రుడున్నాడు వారినిఆశ్ర యించు అని చెప్పింది. వెంటనే ఆ బాలుడు దేవివాణిని శిరసావహించి శ్రీ గురుని దర్శించాడు. శ్రీ గురుడు ఆ బాలుని శిరస్సుపై తన దివ్య హస్తాన్ని ఉంచి వ్రతవోచ్చారణ చేశాడు. అద్భుతం- వెంటనే ఆ బాలునికి నాల్క మొలిచింది. సర్వవిద్యా పారంగతుడైనాడు. ఎంతటి మహిమ!

కొన్నినాళ్ళ అనంతరం శ్రీ గురుడు అమరపురం చేరారు. అక్కడ శ్రీ గురుని మహాత్మ్యము మనవి చేస్తాను. ఒకరోజు శ్రీ గురుడు ఒక పేద బ్రాహ్మణుని ఇంటికి భిక్షకు వెళ్ళారు. ఆ బ్రాహ్మణుడు ఉపాదానానికి ఊళ్ళోకి వెళ్ళాడు. ఆతని పత్ని ఇంట యున్నది. శ్రీ గురుడు "భిక్షాం దేహి" అన్నాడు. పాపం ఇంట్లో ఏమీలేదు. ఆ సాధ్వి ఇంకా అన్నం వండ లేదు. భర్త తీసుకొని వచ్చే యాయవారపు బియ్యంకోసం ఎదురుచూస్తోంది. ఇంటి దొడ్డిలోయున్న బచ్చలికూర కోసి పులుసు చేసింది. ఆ సమయంలో శ్రీ గురుడు భిక్షకు వచ్చాడు ఆమె ఏమీతోచక సిద్ధంగా ఉన్న బచ్చలి కూర పులుసు భిక్ష పాత్రలో వేసింది. శ్రీ గురుడు దానినే స్వీకరించి, వెళుతూ వెళుతూ దొడ్లోయున్న బచ్చలిపాదును వ్రేళ్ళతో పెకలించి వెళ్ళి పోయారు. అది చూచిన ఆ సాధ్వి అయ్యో! నేనేమి చేశాను. ఇంట్లో అన్ని ఉంచుకొని నేను స్వామికి సమర్పించకపోతే పాపమే! నా వద్ద బచ్చలికూర పులుసే యున్నది కదా. నేను భక్తితో సమర్పించితిని కదా? స్వామి ఎందుకు ఇలా చేశారో అని దుఃఖించినది. కొంతసేపటికి యాయవారానికి వెళ్ళిన భర్త గృహానికి వచ్చాడు. సాధ్వి దుఃఖించింది. జరిగినదంతా పూస గ్రుచ్చినట్లు చెప్పింది. అప్పుడు ఆ బ్రాహ్మణుడు "సాధ్వీ! దుఃఖించకుము. అంతా కర్మానుసారం జరుగుతుంది. ఎవరు చేసిన కర్మ వారనుభవించ వలసినదే. శ్రీ గురుడు సాక్షాత్తు బ్రహ్మ విష్ణు శివాత్మకుడు. సాక్షాత్తు దత్త పరబ్రహ్మ. ఆ యతీంద్రుని క్రియలన్నియు మహిమోపేతములే. ఆ స్వామి ఆ బచ్చలితీగెను ఎందుకు పెళ్ళగించిరో! మనమే మెరుగుదుము. మహాత్ము లను నిందించరాదు! అని ఓదార్చి ఆ బచ్చలితీగెను మరల పాతిపెట్ట సంకల్పించి, అక్కడ ఆ పాదును గునపంతో త్రవ్వాడు. ఠంగుమన్నది.

ఏమిటా అని నెమ్మదిగా చుట్టూ త్రవ్వాడు. ఆశ్చర్యం. ధనము నింపబడిన బిందె బయల్పడినది. ఆ దంపతులు ఆనందానికి అవధిలేదు. వెంటనే ఆ పుణ్యదంపతులు శ్రీ గురునివద్దకు హుటాహుటీగా వెళ్ళారు. ఆ విచిత్రాన్ని విన్నవించుకున్నారు. శ్రీ గురుడు మందస్మిత హృదయార విందుడై వారిని ఆశీర్వదించి, "నాయనా! మీరు పుణ్యదంపతులు. మీకు భగవదనుగ్రహము కల్గినది. ఈ విచిత్రాన్ని ఎవరితోను చెప్పకండి. శేష జీవితాన్ని సుఖమయం చేసుకొని, దైవారాధనలో నిమగ్నులై తరించండి" అని ఆశీర్వదించారు. ఆ పుణ్యదంపతులట్లుచేసి కైవల్యాన్ని సాధించారు. ఎంత మహిమ!

ఇలా ఉండగా ఒక అద్భుతం జరిగింది. గంగానుజుడను భక్తుడు శ్రీ గురుని దర్శనార్థమై వచ్చాడు. అప్పటికే శ్రీ గురుడు కృష్ణానదివైపుకు నడుస్తున్నారు. "అయ్యో! స్వామి దర్శనంకాలేదే" అని విచారించి, గంగా నుజుడు శ్రీ గురుని వెంబడించాడు. ప్పుడొక చిత్రం జరిగింది. శ్రీ గురుని పాదస్పర్శ తగలగానే ఆ నది త్రోవ ఇచ్చింది. అక్కడ ఒక దివ్య ద్వీపం గోచరించింది. అక్కడ శ్రీ గురుడు సింహాసనాసీనుడై యున్నాడు. యోగినులు ఆయనకు నీరాజనం ఇస్తున్నారు. ఆ దృశ్యాన్ని చూచిన గంగానుజుడు దిగ్భ్రాంతిచెంది కదలక మెదలక అట్లే నిలబడీ పోయాడు. ఇంతలో అతనిని శ్రీ గురుడు చూచాడు. ఇలా అన్నాడు. "నాయనా! నీవు ఇప్పుడు చూచిన దృశ్యాన్ని ఎవరికి చెప్పవద్దు. నీ పూర్వ పుణ్యంవల్ల ఈ దర్శనాన్ని పొందావు. నీవు ఇప్పుడు చూచిన దృశ్యాన్నే స్మరిస్తూ, తరించు" అని ఆశీర్వదించారు.

ఆ భక్తుని భక్తికి శ్రీ గురుడు సంతసించి, అతనికి కాశీ, ప్రయాగ, గయ-త్రిస్థలులను-యోగమార్గంద్వారా దర్శింపచేసి అనుగ్రహించారు. అప్పటినుండి గంగానుజుడు శ్రీ గురుని సేవలో తరించి కృతార్థు డయ్యాడు. శ్రీ గురుని మహిమలు ఎంత విన్ననూ తృప్తి కలుగదు.

కొంతకాలం గడచింది. ఇట్లుండగా, సజ్జనులుతోపాటు దుర్జనులు కూడా ఇచ్చటకువచ్చి అపవిత్రం చేస్తారని తలచి శ్రీ గురుడు ఆ ప్రదేశా న్నుండి వెడలిపోవాలని సంకల్పించాడు. అప్పుడు యోగినులు దుఃఖిం

చారు. అప్పుడు శ్రీ గురుడు ఈ విధంగా వచించారు. "యోగినులారా! దుఃఖించవద్దు. నేను అంతర్యామిని. సర్వవ్యాపకుడను. నేను అదృశ్య రూపంలో ఇక్కడే వుంటాను. భక్తకోటిని అనుగ్రహిస్తాను. ఈ క్షేత్రం చాలా పవిత్రమైనది. సర్వవ్యాధులు నశింపచేసే పుణ్యక్షేత్రము. కొంచెం జపం చేసిన కోటి ఫలితాన్నిస్తుంది. అని చెప్పి, ఉదుంబర వృక్షమూలంలో తన పాదుకలను పెట్టి, ఎవరైతే అష్ట తీర్థంలో స్నానంచేసి, భక్తితో ఈ పాదుకలను అర్చిస్తారో వారు ఐహిక ఆముష్మికసౌఖ్యాలను పొందుతారు" అని ఆశీర్వదించారు. ఆ తర్వాత శ్రీ గురుడు భీమ, అమరజా తీరాన గల గంధర్వ నగరానికి వెళ్ళారు.

శ్రీ నృసింహ సరస్వతి స్వామివారు సాక్షాత్తు శ్రీ దత్త భగవానుడే. వారు సర్వశక్తి సంపన్నులు. వారికి సాధ్యాసాధ్యాలు లేవు. దీనులను ఉద్ధరించుటయే వారి కార్యము. స్వామి అనేక మహిమలను ప్రదర్శించారు. అందు మరియొక ఘట్టమును వివరిస్తాను. ఒకనాడు స్వామి ఒక పేద బ్రాహ్మణుని ఇంటికి వెళ్ళి కొంచెం పాలు ఇమ్మని కోరారు. ఆ ఇంటి ఇల్లాలు 'స్వామీ! పాలులేవు" అని విన్నవించుకున్నది. "అదేమిటమ్మా! దొడ్డిలో గేదెను కట్టివేసివి గదా! పాలు పితికి ఇవ్వు" అన్నారు. అందుకు ఆమె సమాధానంగా "స్వామి! ఆ గేదె గొడ్డుపోయినది. పాలు ఇవ్వదు. ముసలిది అన్నది. స్వామి చిరునవ్వు నవ్వారు. "ఎందుకమ్మా అట్లా అంటావు. పాలు పితికి చూడు. నీకే తెలుస్తుంది" అన్నారు. యోగిపుంగవుల వాక్కు శిరోధార్యమని తలచి ఆమె పాలు పితికింది. ఆశ్చర్యం! పాలు ధారాళంగా వచ్చాయి. ఆమె ఆశ్చర్యచకితురాలైంది. స్వామి పాదాలమీద వ్రాలింది. కన్నీటితో స్వామీ అనుగ్రహించు అన్నది. పాలు కాచి స్వామికి సమర్పించింది. ధన్యురాలు.

మరియొక అద్భుతం!

మాహురపురం అనే గ్రామంలో గోపీనాధుడనే బ్రాహ్మణుడుండే వాడు. ఆ బ్రాహ్మణ దంపతులకు శ్రీ దత్తాత్రేయ స్వామివారి అనుగ్రహం వల్ల లేకలేక ఒక పుత్రుడు జన్మించాడు. అతనికి వారు దత్తుడని నామ కరణం చేసారు. అతడికి 16 సంవత్సరములు వయస్సు వచ్చింది. యువకు

దయ్యాడు. వేద వేదాంగ పారంగతుడయ్యాడు. తల్లిదండ్రులు అతనికి సావిత్రియను కన్యతో వివాహం చేశారు. ఆ నూతన దంపతులు భోగ భాగ్యాలతో కళకళలాడుతున్నారు. ఇలా ఉండగా దురదృష్టంవల్ల ఆ దత్తునికి క్షయవ్యాధి సోకింది. ఎంత వైద్యం చేసినా నిమ్మళించలేదు.. సావిత్రి పతివ్రత. భర్తను కంటికి రెప్పవలె కాపాడుకొంటు సేవించు కుంటున్నది. రోజు రోజుకు వ్యాధి ముదిరిపోయింది. భర్త క్షీణించు చుండెను. భర్తతోపాటు సావిత్రికూడా క్షీణించుచున్నది. వేరు దిక్కు తోచలేదు భర్త కన్నీరిడెను. ఆమె హృదయము ద్రవించిపోయినది.పిన్న వయస్కురాలైన సావిత్రికి కొండంత కష్టము వచ్చెను. ఆమె మహా పతివ్రత. భర్తనే సాక్షాత్తు దైవంగా ఆరాధించుచుండెను. ఇంతలో ఆమెకు ఒక శుభ వర్తమానము తెలిసెను. గానుగాపురంలో ఒక మహానుభావు డున్నాడని అచటకు వెళ్ళినచో ఆమె భర్త బ్రతుకగలడని ఆమెకు కొండంత ఆశ గలిగెను. అత్తమామల అనుజ్ఞ తీసుకొని భర్తను ఒక మేనాలో కూర్చుండపెట్టుకొని ఆమె పాదచారియై శ్రీ దత్తభగవానుని మనసారా ధ్యానించుచు అనేక విధములుగా ప్రార్థించుచు దీనాతిదీనంగా కంట తడిపెట్టుకొనుచూ, "స్వామీ! ఓ దత్తప్రభూ! నీవేదప్ప మాకు ఇతరములేదు. నీవే దిక్కు! రక్షించినా భక్షించినా నీవే స్వామీ! అనుగ్ర హించవయ్యా!" అని అనేక విధముల ప్రార్థించుచూ భర్తకు ఎట్టి కష్టము కలుగకుండా మేనా నడిపించుచూ ప్రయాణము సాగిస్తోంది. ఇంతలో ఒక ఘోరము జరిగింది. మేనాలోనే భర్త కన్నుమూశాడు. అది గ్రహించిన సావిత్రి గుండెలు బాదుకొనుచూ ఎక్కి ఎక్కి ఏడ్వసాగింది. ఆమె రోదన తీవ్రత బ్రహ్మాండము నిండెనా! అన్నట్లు ఉండెను. ఆ అడవి మార్గములో ఒక సాధువు ఎదురు వచ్చాడు. రుద్రాక్షహారములతో, దండ కమండలు ధారియగు ఆ సన్యాసి ఆమెను చూచి ఇలా వచించాడు. "అమ్మా! ఎంత యేడ్చినా పోయినవాడు తిరిగి వస్తాడా! విలపించి ఏమి ప్రయోజనము. కనుక ముందు సంగతి ఆలోచించుము. నీవు పతివ్రతలాగా గోచరించు చున్నావు. భర్తతో సహగమనము చేయవచ్చును. లేక వైధవ్యమును స్వీక రించవచ్చును. ఇక నీ ఇష్టము", అనెను. సావిత్రి త్రుళ్ళిపడింది. స్వామీ!

మీరు సర్వజ్ఞులు. మీకు తెలియనిది ఏమున్నది. నేను నా పతిని అనుసరిస్తాను. సహగమనం చేస్తాను" అని పలికింది. అప్పుడు ఆ యతివరేణ్యుడు ఇలా వచించారు. "సాధ్వీ! చక్కగా వచించావు నీవు గురు దర్శనానికై బయలుదేరావు కనుక శ్రీ గురుని మొదట దర్శించు. తర్వాత స్నానం చేసి విభూది ధరించి, రుద్రాక్షలను ధరించి, నీ పతితో కూడా సహగమనం చెయ్యి!" అని చెప్పి రుద్రాక్షలు, విభూతి ఇచ్చి వెళ్ళిపోయాడు.

సావిత్రి స్నానం చేసింది. విభూతి ధరించింది. రుద్రాక్షలను యతీశ్వరుడు చెప్పినట్లు ధరించింది. శ్రీ గురుని మనసారా స్మరించింది. "స్వామీ! ఓ గురుదేవా! నీవు సర్వశక్తి సంపన్నుడవు. త్రిమూర్త్యాత్మకుడవు. నిన్ను మించిన దైవం ఎక్కడ వున్నదయ్యా! గజేంద్రుని రక్షించావు. ద్రౌపదిని కటాక్షించావు. పతివ్రతలను స్మరణమాత్రము చేతనే రక్షింతునని శపథం చేశావు. నేను పూర్వజన్మలో తెలిసియో, తెలియకయో ఏదో మహాపాపం చేశాను. ఫలితం అనుభవిస్తున్నాను. నేను చేసిన పాపం నేనే అనుభవించాలిగాని దైవాన్ని దూషించి ఏమి ప్రయోజనము. ఓ నృసింహ సరస్వతి ప్రభూ! నిన్నే నమ్మాను. నీ పాదముల చెంతకు వస్తున్నాను. అనుగ్రహించు. నా పతితో సహగమనం చేస్తాను" అని అనేక విధములుగా దీనాలాపములు చేయుచు ఆ పతివ్రతా శిరోమణి శ్రీ నృసింహ సరస్వతీంద్రులకు ప్రణామం చేసింది.

ఆశ్చర్యం! అద్భుతం!! శ్రీగురుడు ఆమెను "సౌభాగ్యవతివికమ్మ, పుత్రవతివికమ్మ" అని ఆశీర్వదించారు. అచ్చటివారంతా ఆశ్చర్యచకితులైనారు. శ్రీ గురునికి జరిగినదంతా చెప్పారు. స్వామి చిరునవ్వుతో ఇలా అన్నారు. "ఆ శవాన్ని తీసుకురండి" అన్నారు. ఆ శవంపై మంత్ర జలాన్ని ప్రోక్షించారు అంతే నిద్రలోనుండి లేచినవానివలె దత్తుడు పూర్ణారోగ్యవంతుడై లేచి కూర్చున్నాడు. సావిత్రి ఆనందానికి అవధులు లేవు. అక్కడి వారంతా ఆనందించారు. భార్యాభర్తలిద్దరు శ్రీగురుని స్తుతించారు. శ్రీ గురుని ఆశీస్సులుపొంది ఆ దంపతులు జీవితమంతా భగవద్ధ్యాన పరులై కైవల్యాన్ని సాధించారు.

సాధు రూపంలో వచ్చి పరీక్షించినది ఎవరోకాదు. సాక్షాత్తు శ్రీ దత్త

భగవానుడే. దత్త పరీక్షలో నెగ్గి ఆమె ధన్యురాలైనది. మనం కూడా శ్రీ గురుని నిశ్చల మనస్సుతో, అచంచల విశ్వాసంతో భజించి ధన్యుల మగుదుముగాక!

శ్రీ నృసింహ సరస్వతి స్వామి సాక్షాత్తు దత్తావతారులని తెలుసు కున్నాం. వారిని సాక్షాత్తుగా మనం చూడలేకపోయినా, వారిని సాక్షాత్తుగా దర్శించి, వర్ణించిన వారి రూపాన్ని ధ్యానంచేసి తరించెదముగాక!

వటవృక్షము క్రింద గట్టుమీద పద్మాసనం వేసుకుని కూర్చున్నారు. చెంపకు చారడేసి కన్నులు పద్మముల వలే మెరిసిపోతున్నాయి. బంగారు శరీరచ్ఛాయ గలిగియున్నారు కాషాయవస్త్రము ధరించినారు. మెడలో రుద్రాక్షమాలలు ధరించియున్నారు. విభూతి ఫాలమున ధరించి, దండమే మండలధారియై చిరునవ్వు చిందించుచు అనేక లీలలను ప్రదర్శించుచు తెల్లని దివ్యకాంతి పుంజమువలే త్రిమూర్త్యాత్మకుడై శ్రీ దత్తాత్రేయ పూర్ణా వతారుడై విలసిల్లి యున్నారు.

ఇట్టి గురుదేవులను నిరంతరము శ్రద్ధాభక్తులతో సేవించి తరింతుము గాక!

## సద్గురువును మానవమాత్రునిగా శంకించటం పాపము

శ్రీ నరసింహ సరస్వతి స్వామివారి శిష్యులలో తంతకుడనే భక్తుడు ఉండేవాడు. తంతకుడు తన కర్తవ్యాలను నెరవేర్చుకుంటూ గురు సేవ చేసుకుంటూ ఉండేవాడు. అతడు శ్రీ స్వామిని శ్రద్ధాభక్తులతో సేవ చేసుకుంటూ ఉండగా, ఒకరోజు తన బంధువర్గంలో కొందరు శివరాత్రికి శ్రీశైలం బయలుదేరిపోతూ, తంతకుని కూడా రమ్మన్నారు. కాని అతడు వెళ్ళలేదు. "నా గురువే మల్లికార్జునుడు. ఈమఠమే శ్రీశైలం" అన్నాడు. వీడు మూర్ఖుడు. అని బంధువులు ఎగతాళిచేసి వెళ్ళిపోయారు. ఆకాలంలో శ్రీశైలం వెళ్ళటానికి 15 రోజులు, తిరిగి రావటానికి 15 రోజులు పట్టేది. వాహన సౌకర్యం లేదుగదా. శివరాత్రి 15 రోజులు ఉందనగనే వాళ్ళు వెళ్ళిపోయారు. తంతకుడు యథాప్రకారం శ్రీ గురుని దైవంగా ఆరాధి స్తున్నాడు. ఇంతలో శివరాత్రి రానే వచ్చింది. యథాప్రకారం తంతకుడు తన కర్తవ్యాలను చేసుకొని శ్రీ గురుని సేవ కోసం మఠానికి వచ్చాడు.

శ్రీగురుడు ఇలా వచించారు. "నాయనా! ఏమిటి? నీవారందరు శ్రీశైల క్షేత్రానికి వెళ్తే, నీవు ఎందుకు వెళ్ళలేదు? "అని. తంతకుడు శ్రీ గురునికి నమస్కరించి," స్వామీ! ఈ మఠమే నాకు శ్రీశైలం." మీ పాదములే పరబ్రహ్మం. ఆ భ్రమరాంబ మల్లికార్జునులు తమరే! మిమ్మే ఆశ్రయించాను." అని విన్నవించాడు. శ్రీగురుడు తంతకుని భక్తికి సంతోషించి, "నాయనా! నీవు వచించినది సత్యం. అయినప్పటికి ఈరోజు పర్వదినం శ్రీశైల క్షేత్రము చాలా సిద్ధిక్షేత్రం". ఈనాడు పరమేశ్వరుడు తాను సర్వవ్యాపి అయినా అచ్చట విశేషంగా ఇంటాడు. నీవు భక్తుడివి. కనుక నీకు ఇప్పుడే శ్రీశైలం దర్శనం చేయిస్తాను. ఈ పాదుకలు ధరించు, కళ్ళు మూసుకో" అన్నారు. అంతే శ్రీ గురుడు తంతకుని యోగ మార్గంలో క్షణంలో శ్రీశైలం చేర్చి కళ్ళు తెరు అన్నారు. కళ్ళు తెరచాడు-శ్రీశైలక్షేత్రం దర్శనం చేశాడు. స్వామి ఆజ్ఞామేరకు క్షౌర స్నానాలు చేశాడు. శ్రీ మల్లికార్జుని దర్శించాడు, ఆశ్చర్యం ఆ లింగంలో శ్రీ గురుడే దర్శనమిచ్చాడు. ఆహా ఎంతటి అదృష్టం. ఇంతలో అతని బంధువులు కనిపించారు. "అరె! నీవెప్పుడొచ్చావు. రానన్నావుగదా! ఇంత త్వరగా ఎలా రాగలిగావు? అని ప్రశ్నించారు. గురుదేవుల ప్రభావంవల్ల వచ్చానన్నాడు. కాని వారు నమ్మలేదు. తంతకుడు శ్రీ గురుని దర్శించి, "స్వామీ! ఇక్కడ కూడా మీరే ఉన్నారు! అహా! అని పాద నమస్కారం చేశాడు. తర్వాత గురుదేవుడు తంతకుని మరల యోగ మార్గాన మఠానికి చేర్చారు. అచ్చట వారి బంధువులు "ఏమిటి! నీవు క్షౌరం చేయించుకున్నావెందుకూ అని ప్రశ్నించారు. శ్రీ గురుడు తనను శ్రీశైలం తీసుకువెళ్ళి దర్శనం చేయించిన ఉదంతం అంతా పూస గ్రుచ్చినట్లు చెప్పాడు. కాని వాళ్ళు నమ్మలేదు. ఇప్పటిదాకా ఇక్కడే ఉంటివి శ్రీశైలం ఎప్పుడు వెళ్ళావు అప్పుడే ఎట్లా తిరిగి వచ్చావు? అని ఎగతాళి చేశారేగాని తంతకుని పలుకులు విశ్వసించను లేదు శ్రీ గురుని మహిమను గ్రహించను లేకపోయారు 15 రోజుల అనంతరము శ్రీశైలం వెళ్ళిన బంధువులు తిరిగి వచ్చారు. తంతకుని చూచి ఆశ్చర్యపడుతూ ఇలా అన్నారు "నిన్ను శివరాత్రినాడు శ్రీశైలంలో చూచాంగదా. మాకంటే ముందుగా ఇంత త్వరగా ఎలా వచ్చావు? అన్నారు. అప్పుడు గ్రామంలో వున్న బంధువులు తంతకుని

మాట నమ్మారు. "నీవు చాలా భక్తుడవు. అదృష్టశాలివి గురుకృపను పరి పూర్ణంగా పొందిన పవిత్రుడవు" అని కొనియాడారు. శ్రీ గురుని మహి మను ఉత్సుకతో పొగిడినారు. ఇలా ఎన్ని చెప్పుకున్నా గురుని మహిమలు, లీలలు తనివితీరదు.

శ్రీ గురుని మహిమలు ఎన్ని చెప్పుకున్నా తనివితీరదు. అద్భుతమే కాదు! పరమాద్భుతమైన ఒక సన్నివేశం జరిగింది. దానిని నెమరు వేసు కొని తరిద్దాం. శ్రీ గురుడు ప్రతిరోజు సంగమానికి స్నానానికి వెళతారు. దోవలో ఒక వ్యవసాయదారు డుండేవాడు. అతడు శూద్రుడు. అయితే నేమి భక్తిప్రపత్తులు కలిగినవాడు. శ్రీ గురుని సాక్షాత్తు పరమేశ్వరునిగా భావించి సేవించేవాడు. స్వామి ఎప్పుడు వస్తారా అని ఎదురు చూచేవాడు. ఆయన నడిచేమార్గంలో ముళ్ళు, రాళ్ళు ఏరిపారేసి దారి సుగమం చేసే వాడు. శ్రీ గురునికి నమస్కారం చేసేవాడు. ఇలా కొన్నాళ్ళు జరిగింది. ఒక రోజున శ్రీ గురుడు ఇలా వచించాడు.

"నాయనా! రోజు ఎందుకు ఇంత శ్రమ పడుతున్నావు. ఏమిటి నీ కోరిక" అన్నారు. ఆ రైతన్న స్వామికి సాష్టాంగపడ్డాడు. "తండ్రీ ! నా పొలం చూచావు గదా! నాకు ఒకే ఒక కోరిక వుంది. నా పొలం చక్కగా పండాలి! నేను నీ భక్తుడను. నన్ననుగ్రహించు" అని వినయ విధేయతలతో ప్రార్థించాడు. శ్రీ గురుడు వాని వంక, వాని క్షేత్రం వంకా చూచారు. పొలం ఏపుగా పెరిగి వున్నది. కాని ఫలప్రదం కాలేదు. లేతగా వున్నది." స్వామి పరీక్షించ సంకల్పించారు. "నాయనా! నీకు నా మీద విశ్వాసం ఉంటే, నేను సంగమ స్నానంచేసి తిరిగి వచ్చే లోపల పైరును కోయించు" అని వచించి వెడలిపోయారు. ఆ వ్యవసాయదారుడు ముందు వెనక ఆడలేదు. ఇది తరుణం కాదే. ఇప్పుడు కోత ఏమిటి ? అని ఆలోచించలేదు. గురువు ఆజ్ఞ. శిరోధార్యం అనుకున్నాడు. సంపూర్ణ విశ్వాసంతో పరుగిడుతూ యజమాని వద్దకు వెళ్ళాడు. "అయ్యా! నీపొలం నేను కౌలుకు తీసుకున్నానుగదా! నీకు ఇబ్బడి ధాన్యం చెల్లిస్తాను. ఇప్పుడు పైరు కోయటానికి అనుమతించు" అని ప్రార్థించాడు. యజమాని విస్తు

పోయాడు. ఇదేమిటి ఇప్పుడు పైరు కోయటమేమిటి? "నీకేమైనా మతి పోయిందా" అని గద్దించాడు. రైతన్న మొండికి పడ్డాడు. నా గుర్వాజ్ఞ అయినది. నేను పైరు కోయాలి. మీకు ఇబ్బడి ధాన్యం కొలుస్తాను. నాకు అనుమతివ్వండి" అని పట్టుపట్టాడు. చేసేదిలేక యజమాని అంగీకార పత్రం ఇచ్చాడు. వెంటనే రైతన్న కూలీలను పిలిచి పైరు కోయమన్నాడు. కూలీలు కూడా ఇదేమి పని. అకాలంలో పైరు కోయటమేమిటి అన్నారు. మీ కూలీ మీకిస్తున్నాను. నేను కోయమంటున్నాను. మీ పని మీరు చేయండి అని గద్దించాడు. విధిలేక వారు కోత ప్రారంభించారు. ఆ రైతన్న భార్యకు ఈ విషయం తెలిసింది. గుండెలు బాదుకుంటూ, నెత్తికొట్టుకుంటూ పిల్లలు వెంటరాగా,పసివానిని చంకన వేసుకొని పరుగు పరుగునా వచ్చింది. భర్తను కోత పనినుండి తప్పించాలని కాళ్ళా వేళ్ళా పడింది. ఏడ్చింది. మొత్తుకుంది. ఈయనకు మతిలేకపోతే, మీకు మతి లేదా అని కూలీలను హెచ్చరించింది. ఏమి ప్రయోజనం లేకపోయింది. భర్త గుర్వాజ్ఞబద్ధుడై అచంచల దీక్షతో కోత పని పూర్తిచేయించి శ్రీగురుని రాకకై నిరీక్షిస్తు న్నాడు. ఆమె కూడా పిల్లలతో అక్కడే చతికిలబడి ఏడ్వసాగింది. ఇంతలో శ్రీగురుడు స్నానంచేసి తిరిగి వచ్చాడు. పొలంలో పైరు కోయ బడి వున్నది. రైతన్న భక్తి పారవశ్యంతో శ్రీగురుని నమస్కరించాడు. శ్రీగురుడు ఇలా అన్నారు. "పిచ్చివాడా! నేను హాస్యంగా అన్న మాటను నిజం చేశావే. లేతపైరును కోయించి పారేశావు గదా. యజమానికి పంట ఎలా చెల్లిస్తావు. అమాయకుడా !" అన్నారు. రైతన్న స్వామితో ఇలా అన్నాడు-"తండ్రీ! నీవే నా సర్వస్వము. నీమాటే నాకు వేదవాక్కు. నన్ననుగ్రహించు అని నమస్కారం చేశాడు. "నీకు అంతటి విశ్వాసం ఉంటే అలాగే అవుతుందిలే"అని వెళ్ళిపోయారు. శ్రీగురుని అలాగే చూస్తూ ఉండిపోయాడు ఆ రైతన్న. తర్వాత వెనుదిరిగి చూచేసరికి పొలంలో పంట కుప్పలు, కుప్పలుగా నిండి వుంది. అందరూ ఆశ్చర్యచకితులైనారు. రైతు భార్య ఆనంద పరవశురాలైంది. కూలీలు పరుగెత్తుకు వచ్చారు. అందరూ శ్రీగురుని వేనోళ్ళ స్తుతించారు. పంటను తోలుకు వెళ్ళారు.

కొన్నాళ్ళు జరిగింది. మూలానక్షత్రం వచ్చింది. ధారాళంగా వర్షాలు పడ్డాయి. ఆ పొలం మరల చిగురు తొడిగింది. మరల చక్కని పంట పండింది. ఆశ్చర్యం శ్రీగురుని అనుగ్రహంవల్ల ఆ సంవత్సరం రెండు పంటలు పండాయి. భార్యభర్తలు పిల్లలను వెంటపెట్టుకొని శ్రీగురుని దర్శించి నమస్కరించి స్వామి సేవలో తరించారు.

శ్రీగురుని మరియొక మహిమను తలుచుకొని తరిద్దాం. వైడూర్య పురంను ఒక ముసల్మాను రాజు పాలించేవాడు. ఆ రాజు సర్వమతము లను సమానంగా చూసేవాడు భక్తుడు. ఆ రాజుగారికి స్ఫోటకం వచ్చింది. ఎన్ని మందులు వాడినా నిమ్మళించలేదు. అప్పుడు ఒకబ్రాహ్మణుని రావించి ఆయన ప్రార్థించాడు. "స్వామీ! నాకు ఈ స్ఫోటకం తగ్గేమార్గం చెప్పండి" అనీ, ఆ విప్రుడు చెప్పాడు- "రాజా ! పూర్వజన్మ పాపంవల్ల వ్యాధులు వస్తాయి. ఔషధాలతో తగ్గని మొండి వ్యాధులుకూడా మహాత్ముల దర్శనం వల్ల తగ్గుతె. కనుక మీరు గానుగాపురంలో వేంచేసియున్న యతీశ్వరుడు శ్రీ నృశింహ సరస్వతి వారిని దర్శించండి" అని చెప్పాడు. వెంటనే ఆ రాజు పరివారసమేతంగా గానుగాపురం వెళ్ళి శ్రీగురుని దర్శించాడు. వెంటనే ఒక విచిత్రం జరిగింది. ఆ రాజుకు ఏదో వింత అనుభవం కలిగింది. శ్రీగురునికి నమస్కరించాడు. వెంటనే శ్రీగురుడు ఇలా వచించారు. "ఓరీ! రజకసేవకా! ఇన్నాళ్ళు ఎక్కడ ఉన్నావురా ? ఇప్పటిదాకా రాలేదేమిరా!" అని చిరునవ్వు నవ్వారు. వెంటనే ఆమ్లేచ్ఛ రాజుకు పూర్వజ్ఞానం కలిగింది. శ్రీగురుడు సాక్షాత్తు శ్రీపాద శ్రీవల్లభులేననియు, తాను చాకలివానిననియు, క్రిందటి జన్మలో నీవు రాజువు అవుతావురా"అని శ్రీగురుడు ఇచ్చిన వరం. అన్నీ జ్ఞాపకం వచ్చాయి. స్వామీ! శ్రీపాద శ్రీవల్లభ గురూ! రక్షించు రక్షించు నేను నీ రజక సేవకుడనే తండ్రి. నాకు ప్రాప్తించిన ఈ ఘోరమైన స్ఫోటక వ్యాధినుండి నన్ను రక్షించు అని ప్రార్థించాడు. అప్పుడు స్వామి అన్నారు- "ఏదిరా నీకు వ్యాధి చూచుకో" అన్నారు. పరమాద్భుతం స్ఫోటకం మాయమైంది. ఎంతటి మహాత్మ్యము.

శ్రీ నరశింహ సరస్వతి స్వామివారి మరియొక లీలను విని తరిం చెదముగాక! శ్రీవారి మహిమలను విన్న రాజుగారు శ్రీవారినే అర్థించి, ఆశ్ర యించి, విన్నవించి, తన రాజధాని నగరానికి పల్లకిలో తీసుకొని పోవు చుండగా ఒక అద్భుతం జరిగింది. దారిప్రక్కన ఉన్న మర్రిచెట్టు పైకి శ్రీగురుడు చూచారు. ఆ చెట్టుపైయున్న బ్రహ్మరాక్షసుడు ఆ కరుణావీక్ష ణంతో సౌమ్యుడై చెట్టు దిగి వచ్చి స్వామికి నమస్కరించి, తనను ఉద్ధ రించమని ప్రార్థించటం, స్వామి ఆ బ్రహ్మరాక్షసునికి సంగమ స్నానం విధించటం, స్నానం చేయగానే ముక్తుడవటం జరిగిందిఎంతటి మహిమ.

శ్రీగురుడు ఆ రాజధానిలో నిర్మించబడిన మఠంలో కొన్నాళ్ళు నివసించటం చూచి త్రివిక్రమ భారతి అనే సన్యాసిని నిందించటంతో శ్రీగురుడు ఆ సన్యాసిని ఉద్ధరించ తలచి కుమశీ గ్రామానికి వెళ్ళటం, జరిగింది. శ్రీ త్రివిక్రమ భారతీ ప్రతిదినము లక్ష్మీనృశింహస్వామి ఆరా ధించేవాడు. ఆయనకు ధ్యానంలో శ్రీ నృసింహస్వామి దర్శనం లభించేది, కాని ఆ రోజు స్వామి దర్శనం అనుగ్రహించలేదు. నదీ తీరంలో నేను ఉన్నాను. నన్ను అక్కడ దర్శించు అని చెప్పటం జరిగింది. అక్కడి కెళ్ళిన త్రివిక్రమ భారతితో శ్రీగురుడు ఇలా వచించారు. "త్రివిక్రమా! నన్ను నిందించితివే. భ్రష్టుడ నంటివే నీకు రాగద్వేషాలు నశించినవా? అన్నారు. త్రివిక్రమునకు జ్ఞానోదయమై- "ఓ నృశింహ సరస్వతీ! నన్ను అనుగ్రహించు" అని శరణు వేడాడు. అప్పుడు శ్రీగురుడు శ్రీ నృసింహ స్వామిగా దర్శనమిచ్చి అనుగ్రహించారు. ఆహా! ఎంతటి మహిమ.

ఒకసారి ఒక విచిత్రం జరిగింది. వేద పండితులమను గర్వముతో రాజాశ్రయం పొందిన ఇద్దరు వేద పండితులు త్రివిక్రమభారతీ వారినే వాదా నికి ఆహ్వానించి, వాదించితే వాదించండి. లేకపోతే పరాజితులై నట్లు విజయ పత్రిక నివ్వండని, గర్విష్ఠులై పలకటం, శ్రీ త్రివిక్రముడు వారిని శ్రీగురుని దగ్గరకు తీసుకొని పోవటం, అప్పుడు శ్రీగురుడు వారికి ఎన్ని అనునయ వాక్యాలు చెప్పినా వాళ్ళు గర్విష్ఠులై ఆయననే అవమానించడం, ఇక ఆలసించరాదు, వీరి గర్వాన్ని భంగంచేసి ఉద్ధరించాలని శ్రీగురుడు

సంకల్పించి, ఆ దారిన పోవుచున్న ఒక మాదిగవాణ్ణి పిలిచి వాడిపై విభూతి చల్లి ఏడు గీతలు గీయటం, వాడు తన గత ఏడు జన్మలను వివరించుచు, చివరి జన్మయైన వేదపండితునిగా నిలచి, వేదము చదువుతూ, గర్విష్ఠులైన ఈ వేదపండితులతో వాదించటానికి పూనుకోవటంతో వారు భయపడి శ్రీ గురుని శరణపొందటం ఎంతటి మహిమ.

ఇది మహాద్భుతము. ఆహా! స్వామీ!! ఎంతటి లీలను ప్రదర్శించితివయ్యా!!! నీవు సంకల్పించితే ఇక తిరుగేమున్నది! దీనుడైన గురుభక్తుని ఉద్ధరించిన సంఘటన పఠించి తరింతుముగాక! భాస్కరశర్మ అనే శిష్యుడు చాలా బీదవాడు. తాను శ్రీగురునికి భిక్షచేసి తరించాలనే తీవ్రమైన కోరికతో ముగ్గురికి మాత్రమే సరిపడు పదార్థములతో వంట సిద్ధంచేసి, శ్రీగురుని కటాక్షం వలన నాలుగువేల మంది భక్తులకు, పశుపక్ష్యాదులకు కూడా తృప్తికలిగించటం పరమాద్భుతము కాదా!

అరవై సంవత్సరములు దాటి జాతి వంధ్య అయిన స్త్రీకి సంతానం కలుగుతుందా! అహా!! ఎంతటి మహిమ. శ్రీగురుని అత్యంత భక్తితో దీనురాలై కొలచిన గంగ అనే ఆమెను పుత్రవతిగా దీవించి తన కృపా వీక్షణముతో సంతతిని ప్రసాదించారు ! ఆహా ! ఎంతటి లీల.

నరహరిశర్మ అను కుష్టువ్యాధి రోగపీడితుడైన వానికి శ్రీగురుని కటాక్షంవల్ల కుష్ఠువ్యాధి అంతరించి పూర్ణ ఆరోగ్యవంతుడవటం— ఎంతటి మహిమ !

ఇక నందిశర్మ వృత్తాంతం. పరమ విచిత్రం. నందిశర్మ కుష్ఠురోగి. రోగనివారణకు తుల్జాపూర్ భవానిదేవిని ఉపాసించగా,ఆమె "నాయనా!చండ కేశ్వరిని ఆరాధించు" అని వంచించింది. వెంటనే నందిశర్మ చండలేశ్వరిని ఉపాసించగా ఆమె "కుమారా ! గంధర్వపురంలోని సన్యాసిని ఆరాధించు" అని వంచించింది. మానవుని ఆరాధించు అని చెప్పటానికి నీకు సిగ్గుకదా అని విసుగుపొంది, నందిశర్మయై, ఏమి చేయలేక, గంధర్వపురానికి వచ్చాడు. అప్పుడు శ్రీగురుడు నవ్వుచూ— "ఏమయ్యా! దేవతలను వదిలి

పెట్టి మానవుని వద్దకు ఎందుకొచ్చావు. నేను మానవమాత్రుని గదా! నావల్ల ఏమి అవుతుంది" అని నవ్వారు నందిశర్మకు జ్ఞానోదయమైంది "స్వామీ! రక్షించు. నా తప్పును మన్నించు. నా అజ్ఞానాన్ని క్షమించు. నన్నుగ్రహించమని శరణవేడి స్వామికరణతో కుష్ఠురోగం పోయి కృతార్థుడైనాడు. కాని కుష్ఠు అతని శరీరం ఒక చోట మాత్రం మిగిలిపోగా, స్వామి పూర్తిగా పోకుండా కొంచెం మిగిలినదే అని ప్రార్థించగా "నాయనా! నీకు కలిగిన సందేహంవల్ల ఇలా కొంచెం మిగిలింది. నీ సందేహం నివృత్తి చేసుకొని సంపూర్ణ విశ్వాసంతో ఆరాధించు" అని వంచించటం నందిశర్మ సంపూర్ణ శరణాగతిచేసి ఆ రోగం నుండి పూర్తిగా విముక్తుడై- కృతార్థుదవటం ఎంతటి మహిమ.

ఇది పరమాద్భుతం– దీపావళి పండుగకు శ్రీగురుని ఆహ్వానించి సేవించుకోవాలనే కోరికతో ఏడు వేర్వేరు గ్రామాల నుండి భక్తులు రావటం, ఆహ్వానించటం, శ్రీగురుడు అనుగ్రహించటం జరిగింది. మఠంలో భక్తులు స్వామీ మఠంలో వున్న మా సంగతేమి? మేము నిన్ను ఆరాధించే అవకాశాన్ని అనుగ్రహించరా! అని ప్రార్థించటం, స్వామి వారికి కూడా అనుగ్రహ వచన ప్రధానం చేయటం జరిగింది. దీపావళి పండుగ రానే వచ్చింది. శ్రీగుడడు ఎనిమిది రూపాలలో మఠంలోను ఉంటూనే ఏడుగురు భక్తుల ఇళ్ళలోను భిక్ష స్వీకరించి అందరినీ ఒకే సమయంలో అనుగ్రహించారు. భక్తులు ఎవరికి వారు మా ఇంటికి వచ్చారంటే మా యింటికి వచ్చారని ఆనందించారు. కాని కార్తీకమాసంలో అందరు మఠానికి వచ్చినప్పుడు తెలిసింది. స్వామీ ! మఠంలో ఉంటూనే, వేర్వేరు గ్రామాలలో వున్న తమ ఇండ్లకువిచ్చేసి తమ్ము అనుగ్రహించారని.

ఆహా ! స్వామి ! ఎంతటి మహిమను ప్రదర్శించావు గదయ్యా! ఇందుగలడందు లేడను సందేహమే లేదు స్వామీ. నీవు సర్వవ్యాపకుడవు. మమ్ము అనుగ్రహించవయ్యా అని ప్రణమిల్లుదము.

# తృతీయాధ్యాయము

## శ్రీ వారి ప్రబోధము

శ్రీ నృసింహ సరస్వతి స్వామి వారు హరి హర బ్రహ్మాత్మక దత్తాత్రేయ పూర్ణావతారులు. శ్రీ దత్త పరబ్రహ్మమే. స్వామిఅనేక మహిమలు ప్రదర్శించారు. భక్తులకు అనేక బోధలు చేశారు. సందర్భానుసారముగా స్వామి శిష్యులకు బోధలనందించే వారు. స్వామి ఇలా తెలివిచ్చేవారు.

నాయనలారా! శ్రద్ధగా వినండి. ఈ జగత్తు రెండు భాగములతో ఉన్నది. అవే చైతన్య-జడములు. దానినే పరా- అపరా అని అంటారు.. ఇందులో పరాభాగమే ఈ జీవుడు. పరా ప్రకృతియే చైతన్యము. ఆకారము కలదేహమే అపరాప్రకృతి.పరాప్రకృతి యగు జీవుడు అన్నరస పరిణామమే.. ఒక విషయమును తర్కించు క్రియ బుద్ధి మనస్సుచేయుచున్నది. నిశ్చయించు క్రియ బుద్ధి చేయుచున్నది. నేను అను క్రియ అహంకారము. ఈ మూడు జీవుల ఇష్టానుసారమే జరుగుచున్నవి. ఈ శుద్ధచైతన్యమైన జీవుడే విషయములను గ్రహించి, ధారణచేసి, స్మృతికి అందించు చిత్తమనబడుచున్నాడు. తన కిష్టమైన విషయములను ధారణముచేసి మరల స్మృతికి తెచ్చుచు చిత్తమనబడుచున్నది. తన కిష్టము కాని విషయములను మరచి పోవుచున్నది. ఈ చిత్తము అనేక జన్మల బలమైన వాసనలను తనలో ధారణము చేసుకొనియున్నది. చైతన్యము ఘనీభవించి కంటికి కనిపించునట్టి శరీరముగా మారినది. ఇదే స్థూలశరీరము. సూక్ష్మశరీరము కంటికి కనిపించని చైతన్యము జీవుడు తిను పంచభూతమయమైన అన్నము క్రమముగా మనస్సు, బుద్ధి అహంకారములుగా మారుతుంది. ఒక విషయమును గ్రహించుట, దానిని ధారణము చేయుట, దానిని విలీనము చేయుట అను మూడు కర్మలే చిత్తమనబడుచున్నది. జీవుడు తినిన అన్నము స్థూల సూక్ష్మరూపాలుగా మారుతుంది. స్థూలరూపమే మలముగా విసర్జించబడుతుంది. అత్యంత సూక్ష్మరస రూపములో అన్న రసము మాంస

రక్తాదిరూపంలో శరీరంలో పేరుకుంటుంది. అత్యంత సూక్ష్మ కణ రూపం లోకి ప్రాణవాయువు సంయోగంచేత మారే • అన్నసారమే సత్త్వము దీని వలననే శుద్ధ చైతన్యము బలపడుతుంది. ఈ శుద్ధచైతన్యమే విషయాలను తాత్కాలికంగా గ్రహించటం, ధారణం చేయటం, ధ్వంసం చేయటం చేస్తుంది. విషయాలలో అత్యంతము ఇష్టమైన వాటిని నిత్య ధారణము చేస్తూ ఒక స్ఫోటరూపముతో చిత్తంలోకి చేరుతుంది ఈ స్ఫోటముల సమూహములతో కూడిన చిత్తమే జీవుడు. ఈ జలరూపంగా నున్న చైతన్యము దుఃఖానుభవంలో యాతనా శరీరంగాను మారి, జీవుని మరణంలో బయటకు లాగి నరక స్వర్గలోకాలకు ప్రయాణం చేస్తుంది. ఇదే సూక్ష్మ శరీరం. సూక్ష్మ శరీరం చిన్మయం కావటం వల్ల దుఃఖాన్ని కాని, సుఖాన్ని గాని ఈ లోకంలో స్థూలశరీరంకన్నా కోటిరెట్లు గ్రహిస్తుంది. పుణ్య, పాప కర్మఫలాన్ని స్వల్పంగా ఈ లోకంలో,మిగిలిన ఎక్కువ భాగాన్ని పరలోకాలలో జీవుడు అనుభవిస్తాడు. మరణ సమయమున మహాకారణ, కారణ శరీరముల వాసనలతోబాటు ఈ జీవునిసర్వావయములు సూక్ష్మమైన శక్తితో నిర్మించబడి ఈ మానవుని ప్రతిబింబంగా లేచే సుకృత,దుష్కృతకర్మల ఫల భోగార్థము వెడలు శరీరమే సూక్ష్మశరీరము. జీవుడు మరణించిన పదవ రోజున,మృతి అనంతరము ప్రేతలోకంలోనుండు జీవునకు నేనువిచారణచేసి తీర్పునిస్తాను. పాప కర్మలను నరకలోకానికి, మధ్యమకర్మలను పితృలోకానికి, ఉత్తమ కర్మలను స్వర్గలోకానికి పంపబడుతారు.

నరకములో యమధర్మరాజు పాపులను శిక్షిస్తాడు. పాపములు ఎట్లు కలుగును?. మనస్సుచేతను, వాక్కు చేతను, శరీరము చేతను గావించిన తప్పులచేత పాపములు గలుగుతాయి. కాని ఆశ్చర్యమేమంటే, మానవుడు పాపం చేస్తూ ఎవరు చూడవచ్చారులే అని ధీమాతో చేస్తాడు. అది పొరపాటు. మానవుడు చేసే పాపపుణ్యాలు ప్రతిక్షణం చూచే వాళ్ళున్నారు. వారే సూర్య, చంద్రులు, భూమి, ఆకాశము, వాయువు, రాత్రి. పగలు, సంధ్యాకాలము, వీరే సాక్షులు. ఇక పాపం అంటే ఏమిటో విను, సదాచారములను వదలివేయటం, వేదములను దూషించటం, సాధు సజ్జను

లను బాధించటం, తల్లి తండ్రులను దూషించటం, త్యజించటం, అసత్య మాడటం, స్నేహితులను మోసగించటం, దొంగతనం చేయటం; ఆకలితో అన్న మోరామచంద్రా అనే ఆర్తులను వదలిపెట్టి తానే భుజించటం; దుష్టులతో సహవాసం చేసి చేయరాని పనులు చేయటం. పరస్త్రీలను మోహించి వారిని అనుభవించటం ఇలా ఎన్నో వున్నాయి.

యమధర్మరాజు నరకంలో పాపులను శిక్షిస్తాడు. ఈ శిక్షలు ఎందుకు ? అంటే జీవుని దుర్గుణములను పోగొట్టి, సద్గుణములతో సన్మార్గ ముతో నడిపించటానికే కాని, ఇందులో ద్వేషము కాని, కచ్చగాని లేవు. యమధర్మరాజు జీవునికి శారీరక శిక్షలకు లొంగని జీవులను కాల భైరవుడు వారి దుర్గుణములను తన చేతిలోని అగ్నిపాత్రలో యాతనను అనుభ వింపచేసి, రెండవ చేతిలోని పిరిచీతో ఊడ్చివేస్తాడు.

ఈ దండనలు ఎలా వుంటాయో సూక్ష్మకంగా చెపుతాను వినండి.

పరుల భార్యను చులకనగా చూడటం, పరుల ధనాన్ని అపహరించటం వంటి పాపాలకు గాఢాంధకారమైన తామ్రసమనే నరకంలో పడ త్రోసి హింసిస్తారు. పరుల భార్యలను అనుభవించిన జారునికి అంధతామిస్రమనే నరకంలో శిక్షిస్తారు. పరులను మోసంచేసి వారి ధనాన్ని కాజేసి తన కుటుంబాన్ని పోషించేవారిని రౌరవమనే నరకంలో విష జంతువులచే పీడింపబడతాడు. ఎలుకలను, ఉడతలు మొదలగు జీవరాసులను చంపి తినే వారికి కుంభీపాక నరకంలో సలసలలాగే నూనెలో పడవేసారు.

తల్లిదండ్రులను దూషించి బాధించే వారిని కాలసూత్రమనే నరకంలో పడవేసి నిప్పువంటి ఇసుకలో మాడుస్తారు. అతిధి సాక్షాత్తు మహా విష్ణువని తలచక, అతిధిని విడిచిపెట్టి తాను భుజించిన వానిని క్రిమి భోజనమను నరకమున పడవేయుదురు. వావి వరుసలు నెంచక బంధువుల భార్యలను కామించిన వారిని తప్తసూర్మి అనే నరకంలో పడవేసి ఎఱ్ఱగ కాలిన విగ్రహమునను కౌగలింపజేసి శిక్షిస్తారు.

శూద్రస్త్రీ సక్తుడు, కోపిష్టివాడు, వేదములను అమ్ముకుని జీవించే వాడు, నిషిద్ధమైన ఆహారమును భుజించేవాడు సంధ్యాకాలంలో నిద్రించే వాడు, భగవంతునికి నివేదన చేయకుండా భుజించేవాడు మరుసటి జన్మలో చండాలునిగా జన్మిస్తాడు.

గురువుగారిని అవమానించి, నిందించి, ధిక్కరించి ఆయనకు ద్రోహం చేసినవాడు బ్రహ్మరాక్షసు డవుతాడు.

ఇతరుల మనస్సును కష్టపెట్టి గాయపరచినవాడు మరుసటి జన్మలో గుండె జబ్బుతో బాధపడతాడు.

పరస్త్రీని మోహించి ఆమెతో రమించినవాడు నరక శిక్షతో అనంతరం శునకమై పుడతాడు. పరస్త్రీ భగదర్శనం మహాపాపం. అట్టివాడు మరుజన్మలో గ్రుడ్డివాడైపోతాడు. పరస్త్రీని కౌగలించుకొన్నవాడు,హృద్రోగి అవుతాడు.

కనుక జీవుడు ధర్మమును తప్పరాదు. నేనే యముడను. నేనేకాల భైరవుడను. శారీరక శిక్షనొసగి జీవుని పాపక్షాళమును యమధర్మరాజు రూపముతో నేనే చేయుదును. శారీరక శిక్షలకు లొంగని జీవుని మానసిక శిక్షతో పాప క్షాళనమును చేయు కాలభైరవుని కూడా నేనే. నాకు ఏ జీవుని మీద కోపము, పగ, కక్షలేవు. జీవుని పాప విముక్తునిచే సన్మార్గములో పెట్టి ఉద్ధరించుటయే నాకార్యము కనుక అది నా వాత్సల్యమేనని తెలియుము" అని బోధించెడివారు.

## చదుర్థాధ్యాయము
## శ్రీవారి శ్రీశైలయాత్ర

శ్రీ నృశింహ సరస్వతి మహారాజులు శ్రీశైలయాత్ర సంకల్పించారు. శిష్యులతో ఇలా వచించారు. "నాయనలారా! శ్రీశైలంలోని భ్రమరాంబ మ్మూల కారణశక్తి. నా కారణరూపమే భ్రామరీ రూపం. మల్లిఖార్జున లింగమే నా త్రిముఖ షడ్భుజ రూపం. శ్రీశైలం పునర్జన్మ రాహిత్యానికి,

వెంటనే మోక్షాన్ని ఇచ్చే క్షేత్రంగా ప్రసిద్ధి చెందింది. మా కీర్తి విశ్వ వ్యాపకమైనది. భక్తులే కాకుండా ఆచారహీనులైన వారు కూడా నన్ను ఆశ్రయించటానికి, స్వార్ధబుద్ధితో తమ కోర్కెలు తీర్చుకోవటానికి తండోపతండాలుగా వస్తారు. కనుక నేను శ్రీశైలం వెళ్ళదలచాను" అని వచించారు. గానుగాపుర వాసులందరూ కంట తడి పెట్టారు. స్వామీ! మమ్ము విడిచి వెళతారా" అని. స్వామి వారిని ఓదార్చి - "నాయనలారా! నేను శ్రీశైలం వెళ్ళినా, నేను సూక్ష్మరూపంలో శాశ్వతంగా గానుగాపురంలో మధ్యాహ్న భిక్షచేస్తాను. చింతించకండి. నా పాదుకులను ఇచ్చటే ప్రతిష్ట చేస్తాను. భక్తులకు నేను స్మరణ మాత్రప్రసన్నుడనౌతాను" అని వచించారు శ్రీగురుడు శ్రీశైలంప్రయాణమైనారు. శ్రీకృష్ణ సరస్వతి,శ్రీ బాలసరస్వతి, శ్రీ ఉపేంద్ర మాధవ సరస్వతీ మొదలైన యతీంద్రులు తీర్థయాత్రలకు వెళ్ళారు. శ్రీగురుని ఆజ్ఞానుసారం సాయందేవుడు, నందిశర్మ నరహరి, శ్రీ సిద్ధ సరస్వతి శ్రీగురుని అనుసరించారు.

అందరు పాతాళగంగ చేరారు. శ్రీగురుని ఆజ్ఞను శిరసావహించి ఒక ఆసనాన్ని సిద్ధం చేశారు. ఆకులతో పూవులతో తయారుచేసిన ఆ ఆసనం కృష్ణానదిలో (పాతాళగంగ) ఉంచారు. శ్రీగురుడు దానిపై ఆసీనులైనారు. స్వామి అవతారాన్ని చాలిస్తున్నారని తెలుసుకున్నారు. గుండె ఝల్లుమన్నది. కంటి ధారగా విలపించసాగారు. హృదయ విదారకమైన దృశ్యం. స్వామి చిరునవ్వు చిందులాడ ఇలా అన్నారు. "దుఃఖించవద్దు. నేను నా నిజస్థలమైన కదళవనం చేరగానే నాలుగు పూలు కొట్టుకు వస్తాయి. అవియే గురుప్రసాదం స్వీకరించండి" అని చెప్పి స్వామి నిష్క్రమించారు. శిష్యులు దుఃఖసాగరంలో మునిగిపోయారు. కొంతసేపటికి కృష్ణానదిలో నాలుగు పూలు కొట్టుకువచ్చాయి. అవియే గురు ప్రసాదంగా శిష్యులు స్వీకరించారు.

బహుధాన్యనామ సంవత్సర మాఘ బహుళంలో ఒక శుక్రవారం నాడు శ్రీగురుడు స్వస్థానానికి చేరారు.

శ్రీ గురుని చరిత్ర పారాయణచేసి మనమందరం శ్రీగురుని కృపా కటాక్షం చేత తరింతుముగాక !

స్వామీ ! ఎంతటి దయా సముద్రుడవయ్యా ! స్వామీ! త్రిమూర్త్యాత్మకుడవు ! సర్వశక్తి సంపన్నుడవు ! నిన్ను స్తోత్రం చేయటం ఆ ఆదిశేషునికే తరంకాదు. సామాన్య మానవులం మాకు తరమా తండ్రీ ! నీవు పరబ్రహ్మవు ధర్మరక్షకుడవు. ఓ యోగీశ్వరా! మా హృదయారవిందంలో శాశ్వతంగా యుండి మమ్మనుగ్రహించవయ్యా ! ఈ భవ సాగరాన్ని దాటించవయ్యా! అని ప్రణమిల్లుదము.

ఓం శాంతిః శాంతి శాంతి ! 8-2-99

# అనఘామాత దివ్యసందేశం

బహుధాన్య నామ సం॥ మాఘ బహుళ అష్టమి-అనఘాష్టమి. సోమవారం. అనఘామాత దివ్య సందేశం :

అనఘోపనిషత్తు.

ఎవరిని చూచి వేరొక రూపమును చూడపనిలేదో, ఎవరి వాక్యములను విన్నచో వేరొకరి వాక్యములను విన పనిలేదో అట్టి దత్తుడే నాకు దత్తమైన అనగా లభించిన భర్త.

భర్త యనగా భరించువాడు. భార్య యనగా భరింపబడునది. ఈ సర్వజగత్తు అనగా ప్రకృతి యంతయు దత్తునిచే భరింపబడుచున్నది. కావున ఈ ప్రకృతి యంతయు భార్యయే శ్రీ దత్తుడు ఒక్కడే పురుషుడు. పురమనగా శరీరము. అంటే ప్రకృతి. ప్రకృతినంతయు అనగా పురమునంతయు వ్యాపించి భరించువాడే పురుషుడు. కావున పురుష శబ్దానికి

మరల భర్త అనియే అర్థము వచ్చును. కావున ప్రకృతి భార్య. పురుషుడు భర్త. ప్రకృతి రెండు భాగములుగా యున్నది.

పరా ప్రకృతి—అనగా చైతన్యము అనగా జీవుడు.

అపరా ప్రకృతి—జడము. అనగా పంచభూతములతో నిర్మించబడ్డ ఈ అచేతన జగత్తు. కావున ప్రకృతితో భాగమను జీవుడుకూడా భరింప బడుచున్నాడు. కావున భార్యయే.

అనఘు భార్య. అనగా జీవుడేనని ఈ విచారణచేత స్పష్టమగు చున్నది. అనఘ అనగా పాపము లేనట్టి స్వచ్ఛమైన జీవుడు. జీవుడు భార్య అనగా ప్రకృతి కావున స్త్రీ స్వరూపముగా స్త్రీ లింగశబ్దమైన అనఘాశబ్దము చేత సూచింపబడుచున్నాడు. అనగా పాపరహితుడైన జీవుడు మాత్రమే అనఘ యగును. అట్టి జీవుని భారమును తాను వహించి పరమాత్మ అట్టి వానికి మాత్రమే భర్తయగుచున్నాడు. మిగిలిన జీవులను వారి వారి కర్మ బంధములే నిలబెట్టుచూ మోయుచున్నవి. కావున అట్టి జీవులు కర్మల వశ ముతో యుండి కర్మయే భర్తగా కలిగియున్నారు.

పరమాత్మ ఎట్లు సృష్టి, స్థితి, లయ కారణ రూపమున త్రిమూర్త్యా త్మకుడుగా యున్నాడో జీవుడును అట్లే మనోవాక్కాయములను మూడింటి స్వరూపముగా ఉన్నాడు. ఇందులో వాక్కు సరస్వతి, కాయము అనగా ద్రవ్యము లక్ష్మి, మనస్సు అనగా చిచ్ఛక్తి పార్వతి. కావున అనఘ త్రిశక్తి స్వరూపిణిగా చెప్పబడినది. ఈ మనోవాక్కాయములకు సంబంధించిన పాపములేనప్పుడే జీవుడు అనఘ యగును. చేసినట్టి ఈ మూడు రకముల పాపములను భర్తయగు భగవంతుని వద్ద చెప్పుకొని, క్షమాపణము వేడు కొని, పశ్చాత్తాపబడి మరల చేయకుండుటచే జీవుడు అనఘ అగుచున్నాడు అట్టి జీవుడు అధర్మమును వదలి ధర్మస్వరూపుడై స్వచ్ఛమైన తెల్లని గోవు వలె స్వామిని ఆశ్రయించుచున్నాడు. కావున గోమాతయే అనఘమాతయని తెలియవలయును. ఇట్టి గోవును రక్షించి పాలించువాడు కావుననే గోపా

లుడు అనబడుచున్నాడు. స్త్రీ ఎట్లు వినయముచే భయముచే లజ్జచే శోభించుచూ భర్తను శరణాగతి చేయుచున్నదో అట్లే ప్రతి జీవుడును వినయ, భయ, లజ్జా భూషితుడై భర్తయగు పరమాత్మను శరణాగతి చేయవలెను. ఈ పరమార్థమును సూచించుటకే జీవులలో స్త్రీ పురుష భేదములు కల్పించి పాతివ్రత్య ధర్మము ఈ విశ్వనాటకములో సూచించబడినదే తప్ప, పురుష వేషమున నున్న స్త్రీ జీవుడు తాను నిజముగా పురుషుడేనన్న పురుషాహంకారముతో ప్రవర్తించరాదు. అట్లే స్త్రీ వేషమున ఉన్న స్త్రీ జీవుడును తాను పురుష రూపమునఉన్న మరియొక జీవుని సేవించుచున్నానే అను అసూయ కలిగియుండరాదు. ఏలననగా అట్టి సేవచేత స్త్రీ జీవుడు నిజముగా వినయ భయ లజ్జలను మూడు గుణములను అభ్యసించు అవకాశమును కలిగి యున్నాడు. పురుష రూపమున వున్న జీవుడు అట్టి అవకాశము లేక పురుషాహంకారములో పడు ప్రమాదములో యున్నాడు. కావున ఈ లోకమున పురుషుల కన్న స్త్రీలే నిజముగా ఎంతో అదృష్టవంతులు. అన్ని అహంకారములను తపస్సుచేత పోగొట్టుకొన్ననూ కట కడపటి పురుష లింగా హంకారము పోనందులకే ఋషులు గోపికలుగా జన్మించి దానిని పోగొట్టుకొని అనఘా స్వరూపమును పొందినారు. కావున ఏ స్త్రీయును పురుషుని చూచి అసూయ పడ పనిలేదు. పురుషుడు అహంకరించ పని లేదు. ఇదియే అనఘాష్టమినాటి అనఘా మాత యొక్క ఉపదేశ సారాంశము.

త్రిముఖ షడ్భుజం
గురువరోత్తమమ్
పరమ పావనం
పురుష మాశ్రయే ॥

ఓం శాంతి శాంతి శాంతి !

—జన్నాభట్ల వేణుగోపాల కృష్ణమూర్తి
దత్తభక్తులు.

తత్బ్రహ్మార్పణమస్తు



శ్రీ గణేశాయ నమః



శ్రీ సరస్వత్యై నమః

శ్రీ - గురుదత్తాత్రేయాయ నమః

ఓం శ్రీ సాయిరాం

1. సహ్యాద్రి వాసా దత్తదేవా
వేదాంత . .రి దత్తరూపా ॥స॥

2. త్రిమూర్తి స్వరూపా దత్తదేవా
పంచావతార ద త్తరూపా ॥స॥

3. భిక్ష (మధ్యా ్నె) గ్రహీత దత్తదేవ
జ్ఞాన (బ్రహ్మ) ప్రదాత దత్తరూప ॥స॥

4. భక్తజన పోషక దత్తదేవ
భక్తి (జ్ఞాన) ప్రచార దత్తరూప ॥స॥

5. సత్యత త్వబో ధక దత్తదేవా
ఉన్మత్త వేషా ్ త్తరూపా ॥స॥

6. శాస్త్ర ప్రదాత దత్తదేవా
శస్త్ర ప్రయోగ దత్తరూపా ॥స॥



# ఆణి ముత్యములు

1. పుట్టిన వానికి మరణము తప్పదు. మరణించిన వానికి జన్మము తప్పదు. ఇది అనివార్యము. కనుక దీనిని గూర్చి శోకింపరాదు.

2. మనస్సే బంధమునకు మోక్షమునకు కారణము. మనస్సును నిశ్చలముగా యుంచుట కష్టమే. అయిననూ అభ్యాస వైరాగ్యములచే మనస్సును నిరోధించవలెను.

3. ఎవడు కోరికలు లేకుండా, పవిత్రమైన మనస్సుతో, కర్మఫలమును ఆశించక భగవంతుని ఆరాధించునో, వాడే భగవంతునకు అత్యంత ప్రియుడు.

4. సమస్త కర్మలను భాగవదార్పణముగా శరణము పొందినవాడు ధన్యుడు.

5. సర్వ జనోద్ధరణమే నా కార్యము. నా కార్యమునందు పాల్గొనుటయే సేవ. నా సేవలో పాల్గొని జీవన్ముక్తుడవు కమ్ము.

ఓం శాంతి శాంతి శాంతి!

ముద్రణ : డి. బి. ప్రింటర్స్, విజయవాడ-2    ఫోన్ : 434852